# నీతివాచకము.

## ఏడవ పుస్తకము

---


గ్రంథకర్తలు:

మహావాది వేంకటరత్నము, బి. ఏ.

మిన్నికంటి గురునాథశర్మ.





*Publishers :*

**Sundara Ram & Sons, Tenali.**

**1932**




[ 0-7-0

ఓమ్

# నీతివాచకము

## ఏడవ పుస్తకము


గ్రంథకర్తలు:

మహావాది వేంకటరత్నము,

ఆంగ్లోపన్యాసకుడు - ఆంధ్రక్రైస్తవకళాశాల, గుంటూరు.

ఉభయభాషాప్రవీణ

మిన్నికంటి గురునాథశర్మ,

తెలుగు పండితుడు - హైస్కూలు, గుంటూరు.



*Publishers :*

**Sundara Ram & Sons, Tenali.**

**1932**




[ వెల 0–7–0.

# విషయ సూచిక

## నవమాధ్యాయము - సదభ్యాసములు



## దశమాధ్యాయము - నింద్యములు

# ఉపాధ్యాయులకు మనవి.

ఉపాధ్యాయసోదరులారా !

1. ప్రస్తుతము ప్రాథమిక విద్యాప్రపంచములోఁగల నానావిధవాచకముల మార్గము వేఱు. ఈనీతివాచకముల మార్గము వేఱు. పేరును బట్టియే వీనిప్రాశస్త్యము విశదము. ఇవి కేవలము నీతివిషయములనే బోధించును గాని యన్యవిషయములమాట తలపెట్టవు.

2 ఇప్పు డున్న వాచకములలో నీతిపాఠములు తక్కువ. ఉన్న కొన్ని యైనను గాథామూలకములే కాని విషయవిచారణబాహుళ్యము గలవి కావు. "సత్యము చెప్పవలెను" అనువిషయమును బోధించునప్పు డిప్పటి వాచకములు "సత్యమన నేమి? దానియొక్క గొప్పతన మెట్టిది? అది యెట్లు సర్వోత్తమమైనది?" అను విషయములఁగూర్చి విపులముగాఁ గాకున్నను గొద్దిగానైన బోధింపక యందు కుదాహరణముగా నేదో యొక కథను జెప్పుచున్నవి. ఇందువలన బాలురకు విషయమును గూర్చి చక్కగాఁ దెలిసికొను నవకాశము లభించుట లేదు.

3. ఇట్టి కొఱంతను ఈనీతివాచకములు పోఁగొట్టుచున్నవి. ఇందుఁ బ్రతి విషయము చక్కగాఁ దెలుపంబడి చివర విషయనిరూపణమునకుఁగాను కథలు చేర్పంబడినవి. ప్రాథమికవిద్యాప్రపంచములో నిది క్రొత్త యగుటచేత ఈ నీతివాచకములు పనికివచ్చునా? యను సందేహము గలుగవచ్చు. కాని "విద్య" యను పదముయొక్క నిజమైనయర్థము నెఱుంగువా రేమాత్రము సందేహింపరని మావిశ్వాసము.

4. "ఆవు పాలిచ్చును - ఆవుపాలు తెల్లగా నుండును- గుఱ్ఱము బండి లాగును" అను విషయములే బోధనీయములో, తననిత్యప్రవర్తనమును శీలమును సరిచేసికొనుట కనువగు నుత్తమపద్ధతులంగూర్చి బోధించు విషయములే బోధనీయములో యుపాధ్యాయులే యూహించుకొన వచ్చు. పైవిషయములు తనకుఁదాన పెద్దవాఁడైనంతనే బాలుఁడు తెలిసికొనఁ గలఁడు కాని యుత్తమ పద్ధతులం గూర్చినబోధ యతనికి ముఖ్యావశ్యకము.

5. విద్య నేర్చుట జ్ఞానముకొఱకు. లౌకికజ్ఞానమునకు సామాన్యవస్తుగుణగ్రహణమునకు స్వానుభవము చాలు. ఉత్తమజ్ఞానమున కనుభవము

చాలదు. గురుశిక్ష యుండవలె. కావున బాలురకు, బాలికలకు, బోధింపవలసినది నీతివిద్య. నీతియే శీలమునకు నిలయము. శీలమే మానవుని గొప్పతనమునకు మూలము.

6. ఈ యభిప్రాయమును బలపఱచి వ్యాపింపఁజేయుటకే యీవాచకములు వ్రాయఁబడినవి. ప్రహ్లాదుఁడు విద్య నేర్చునప్పుడు తోడిబాలురకు బోధించినవిషయములు స్మృతియందున్నచో నీవాచకముల గొప్పతనము విశదము గాఁగలదు.

7. ఈ పుస్తకములు విద్యార్థులతరగతులకుఁ దగినట్లు రచింపఁబడినవి. అయినను జీవితమునడపుపద్ధతిని పెక్కుతెఱంగులఁ జర్చించి సూచించుటచేఁ బెద్దలకుఁ బిన్నలకు నెల్లర కియ్యవి పఠనీయములనుట కెట్టి సందియము లేదు. జీవితపరమావధి యొక్కండేయగుట ధర్మములు పరస్పరసంబద్ధములగుటఁ దత్సూచకపద్ధతులలోఁ బునరుక్తి యొచ్చటనే నుండక తప్పదు. మఱియు నయ్యది కొన్నియెడల విషయము నొక్కిచెప్పుటకును నుపయోగింపఁబడియుండును. విధినిషేధవాక్యములు నట్లే వ్రాయఁబడినవి. బాలావబోధార్థ మిట్లు చేయవలసివచ్చెను. అందందు విస్తరించివ్రాయఁబడఁదగినబహుభావార్థముల సంక్షేపించి సూత్రప్రాయముగాను వ్రాసియుంటిమి. అందఱకు నుపయోగించుట కుద్దేశించుటచే నందందు శ్లోకము లుదాహరింపఁబడినవి. బాలు రయ్యవి వదలినను వదలవచ్చును.

8. ఈ వాచకములలో బొమ్మలు చేర్పఁబడలేదు. ఇందుకుఁ గారణము జంతువృక్షాదికవిషయంబులు లేకుండుటయే. కథలు విషయనిరూపణమునకుఁగాను చేర్పఁబడినవి గనుక నందును చిత్రములయావశ్యకత కన్పట్టదు. ఇవి మొత్తముమీఁద నూతనమార్గవిరచితంబులు గనుక మే మూహించిన ప్రాశస్త్యము వీనియందు గమనించి యుపాధ్యాయులు విద్యాధికారులు సదభిప్రాయులై ప్రోత్సహింతురుగాక యని మనవి.

గుంటూరు,
30-12-1932.

మ. వేంకటరత్నము,
మిన్నికంటి గురునాథశర్మ.

ఓమ్.

# నీతివాచకము

## ప్రథమాధ్యాయము — సదభ్యాసములు

### ౧.

"సత్యాన్నాస్తి పరో ధర్మః" సత్యముకంటె నుత్తమమైన ధర్మము మఱొకటి లేదని పెద్దలు వచించిరి. సత్యము వచించు వానినే సత్యవంతుఁ డందురు.

తా నెంతవిద్యావంతుఁడైనను, ఎంత ధనవంతుఁడైనను, ఎంత కర్మిష్ఠుఁడైనను సత్యము మాటాడువాఁడు కానిచో వానికిఁ బూజ్యత లేదు. అసత్యము పల్కుచుఁ దా నెన్ని ధర్మకార్యములు చేసినను బూదిలోఁ బోసిన నేయిచందమున నవి నిష్ఫలములే యగునుజుమీ.

సత్య మున్నమాటకే విలువ యెక్కుడు. విలువ యేమిటి?

క. మాటకుఁ బ్రాణము సత్యము
కోటకుఁ బ్రాణంబు సుభటకోటి ధరిత్రిన్
బోటికిఁ బ్రాణము మానము
చీటికిఁ బ్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ!

సత్యమె మాటకుఁ బ్రాణము. సత్యములేనిమాట శవము వంటిది. కాల్బలమువలననే కోట ప్రకాశించును. కాల్బల

మువలనఁ గాపాడఁబడనిచోఁ గోట పరులవలన బద్దలగును. స్త్రీకి మానమే ప్రాణము. చేవ్రాలే చీటికిఁ బ్రాణము. వ్రాలు లేని పత్త్రిక నెవ్వరును నమ్మరు.

సత్యమందే భగవంతుఁ డున్నాఁడు — సత్యమే భగవత్స్వరూపము. ఇఁక సత్యారాధకుఁడు భగవదనుగ్రహమునకుఁ బాత్రుఁడని వేఱ చెప్పవలయునా ?

సత్యము పల్కువాఁడు నిత్యసంతుష్టుఁడై యుండును. వానికే వేళను భయముండదు. వానిని జూచియే పరులు భయపడియెదరు. వానికి లజ్జ లేదు. వాఁడు పరులనే లజ్జితులఁ జేయును. వాఁడు నిత్యశ్రేయములు సత్యారాధనమువలనఁ బడయుచుండును. సంతతానందతరంగములలో నోలలాడుచుండును. సత్యవంతునకు మొగమోట ముండదు. పిఱికితనముండదు. దురాశ యుండదు. దుఃఖ ముండదు. తనవారిని బగవారిని సమదృష్టితోఁ జూచుచుండును.

సత్యవంతుఁడు కామమును గాలఁద్రొక్కును. క్రోధమును రోధించును. లోభమును లొంగఁదీయును. మోహమును మోహరించును. మదమును సదమదముచేయును. మాత్సర్యమును మారణముచేయును.

సత్యముపలుకుట యొకపుణ్యవ్రతము. ఆవ్రతము నాచరించువాని కనేకవిధముల విఘ్నములు సంభవించుచుండును. వాని

నెల్ల దాటినవాఁడే సత్యవంతుఁడు. వాఁడే పూజ్యుఁడు. వాఁడే ధనికుఁడు. వాఁడే యశస్వి. వాఁడే మహాత్ముఁడు. వాఁడే యోగిపుంగవుఁడు.

'మహాగజాః పలాయంతే మశకానాంతు కా కథా' యని నట్లు సత్యము మృత్యువునే జయింప నీఁకలోకమున దాని నెదిరించున దేది ?

సత్యమునకుఁ దపము దాసోహమనును. జపము జయింపఁ బడితి ననును. దానము దీనానన మొందును. జన్నము విన్నఁదన మొందును.

సత్యమున కెల్ల దేవత లాశీస్సులఁ బంపుచుందురు. మానవులు నమస్కారములు చేయుచుందురు.

సత్యరత్నమున కొఱపిడితాలు కష్టములు. కాంతులు బాధానుభవములు. రజ మానందాశ్రుబిందుసందోహము.

సత్యవ్రతము 'తు-చ' తప్పకుండ ననుష్ఠించినవా రీలోకమున వేళ్లపై లెక్కింపఁదగినవా రే.

అది నివురు గప్పిననిప్పువలె నుండును. సమయ మాసన్నమై నంగాని దానిసహజకీలాజాలములు ప్రకాశింపవు.

అజ్ఞానాంధకారము నడంచివేయదు-దెసల వెలిఁగింపదు. ప్రతి వస్తువునకు భిన్నరూపము లుండును. కాని సత్యమున కొక్కటే రూపము. దేశకాలభేదముల కది మార్పునొందదు. అది యెప్ప

టికిని మాఱనిదగుటయందే దానిగొప్పఁదనమున్నది. సత్య వ్రతము ననుష్ఠించుట యారంభదశయందు దుష్కరమేమో కాని, యావల నంతకంటె సుకరమైనది వేఱొకటి లేదు. అర్ధరాత్రిమున నడవియందు దేదీప్యమానముగా వెల్గుచుండు రత్నముం గాంచి భయపడుమూఢునివలె సర్వతోముఖముగా వెల్గుసత్యస్వరూపముం గాంచి యలసులు భీతిసెందెదరు. రజ్జుసర్పన్యాయము దీనికి వర్తించినను వర్తించును.

కావ్యములయందు హరిశ్చంద్రుఁడు సత్యవ్రతము ననుష్ఠించి నట్లు కన్పించుచున్నది.

**హరిశ్చంద్రుఁడు.**

హరిశ్చంద్రుఁ డనృతమాడునని విశ్వామిత్రుఁడు, ననృతమాడఁడని వసిష్ఠుఁడు నొకరితో నొకరు వాదించుకొని దేవేంద్రు నెదుటఁ బందెములు వేసికొని పోయిరి.

ఒకనాఁడు విశ్వామిత్రమహాముని హరిశ్చంద్రచక్రవర్తిదగ్గ ఱకు వచ్చి యజ్ఞార్థమని యపరిమితధనము యాచించి దానిని వలసినప్పుడు కొనిపోయెద నీయొద్దనే యుంచుమని వెళ్లెను. పిదప నొకప్పుడు రాజు వేఁటకుఁబోఁగా ముని కృత్రిమోపాయముల నతనిసర్వరాజ్యము ధారవోయించుకొని పిమ్మట 'నాకిచ్చెదనన్నధన మిమ్మ'ని గర్జించును. అప్పుడు రాజిట్లు చింతించె. 'ఇది యేమి? రాజ్యము సర్వము నిచ్చితినే? ఎన్న

యజ్ఞములనైనఁ జేయవచ్చునే. మఱియు ధన మడుగువేల ? ఇతఁడు కేవలము ధనమునం దాశచే నడుగుట కాదు. నన్ను వంచించుట కిట్లు చేయఁదలపడియె. రాజ్యము ధారవోయు నపుడు 'నీధనసహితముగానే యిచ్చుచుంటి'నని యనమిచే నీచిక్కు కల్గినది. ఇప్పుడు నాకు ధన మెక్కడిది !'

ఇంతలో ముని కనులెఱ్ఱచేసి 'నీకు ధన మిచ్చెదనని యనలేద' నినచో నూరకుండునని తర్జింప రాజు తలవంచి గడు వడిగి కాశికిఁ బయనమగును. ముని వల్లెయని శిష్యుఁ డగునక్షత్రకుని వెంటఁబంపి త్రోవలో ననేకవిధముల బాధలుగల్గించి బొంకింపఁజూచును. కాని రాజు వాని నన్నింటిని గడచి కాశిం జేరి పుత్రవతియు మహాపతివ్రతయు నగుతనభార్యను జంద్రమతిని గాలకౌశికుఁ డనుబ్రాహ్మణున కమ్మి యాధనము నక్షత్రకున కొప్పింప నతం డిది నాబత్తెమునకే సరిపోయినది; మునిధన మీయననుము పోయెద ననును. రాజు కానిమ్మని తనను వీరబాహుఁ డనుమాదిగవాని కమ్ముకొని యాధనము నక్షత్రకున కొప్పించి పంపును. రాజ్య మేలుచక్రవర్తి శ్మశానమునేలుచు మాదిగవానియాజ్ఞమెయి వర్తించుచున్నాఁడు.

నక్షత్రకుఁడు ప్రతివిపత్సమయమున జేనితో 'నసత్యమాడిన నీ కీకష్టము లుండవు. మునియు సంతసించి నీరాజ్యము మరల నీకిచ్చును' అని యెన్నియాశలు గల్పించినను వినక తనయర్ధాం

గిని యువరాజును బజారునఁ దెగనమ్మి తా నొకయంత్యజున కమ్ముడువోయి కాటిలోఁ గాఁపురముండి సత్యమునకు నిల్చిన యీహరిశ్చంద్రకథను వింటిరా? చివరకు విశ్వామిత్రుఁ డోడిపోయి హరిశ్చంద్రునిసత్యనిష్ఠకు మెచ్చుకొని సాటిలేని వరము లిచ్చి సంతుష్టునిజేయును.

'నిజము నిల్కడమీఁదఁ దెలియు' నని పెద్ద లందురు. సత్యమునకుఁ దాత్కాలికముగా న్యూనత యేర్పడినను జవఱి కనుపమానగౌరవము నద్వితీయ విజయము గలుగకపోదు. నిన్నొరులు నిందింతురనికాని, లేక యొరులకుఁ గోపము వచ్చునని కాని, లేక యప్పటిలాభము తప్పిపోవుననికాని యాలోచింపకుము. సత్యవంతునకుఁ బ్రాణము తృణప్రాయము. ఇఁక సంపదలమాట యేమి? బిడ్డల మాట యేమి?

### గోవుమాణిక్యము.

ఒకగోవు బీటిలో మేసి యింటికి వచ్చుచు నొకపులిబారిం బడెను. ఆపులి దీనిని గబళింపఁ బైకుఱుక నుద్యమింప నావు చలింపక నిలువంబడి యిట్లనెను. "అయ్యా! నామనవి యొకటి కలదు. దాని నాలించి పిదప నీయిచ్చవచ్చిన ట్లాచరింపుము. నాబిడ్డ యింటియొద్ద నాకలిచే నకనకలాడుచుండును. నేను వచ్చుత్రోవపైఁ జూడ్కులు పఱపి గంపెఁ డాసతో నుండును. దానికిఁ బాలిచ్చి బుద్ధులు చెప్పి తిరిగి

వెంటనే వచ్చెదను. ఇంత నిజము. నామాట నమ్ముఁడు. నే నెన్నండు బొంకినదానను గాను. బొంకుట మహాపాపమని యెఱుంగుదును. ఒకవేళ నిన్ను వంచించి నేఁడు పోయినను రేపు మరల మేఁత కిచ్చుటకి రావలసినదాననే కదా. అప్పు డెట్లుఁ దప్పించుకొనఁగలను? కనుక నేను తప్పక వచ్చెద"నని నచ్చఁజెప్పి యింటికిఁబోయి బిడ్డకుఁబాలిచ్చి చెప్పవలసిన మాటలు చెప్పి మరల వెంటనే పులి యున్నచోటికి వచ్చి "అన్నా! ఆలస్యమునకు క్షమింపుము. అయ్యో! నీవెంత యాకలిచే బాధపడుచుంటివో. ఇఁక వెంటనే నీవు నన్నారగింపుము" అని పలికెను. వ్యాఘ్రము దానిసత్యసంధత కబ్బురంపడి యున్నచోటునుండి కదలలేకపోయెను. బాలురారా! సత్యము హింసను జయించినదిసుఁడీ !

పిమ్మట ఘాతుకజంతువైనయాపులి యావును బ్రశంసించి 'సత్యకవచమును దొడుగుకొనిన నిన్ను నాకోఱలుగాని పదనైనగోళ్లుగాని భేదింపలేవు' అని తాను హింసాపథమును వదలిపెట్టి గోవును గురువుగాఁజేసికొని ధన్య యయ్యె.

బాలురారా! ఇట్టిసత్యమును బాల్యమునుండియు సేవింపవలయును. అభ్యసింపవలయును. పెద్దయైనపిమ్మట దాని నలవఱుచుకొనుట కష్టము. మొక్కయై వంగనిది మ్రానై వంగునా ?

ఈవిషయమునఁ దల్లిదండ్రులకుఁ జెప్పవలసిన దెంతయో కలదు.

అసలు తల్లిదండ్రులే బిడ్డలకు బొంకుఁబాలు పోయుట. మొట్ట మొదట ముద్దుకు నేర్పుదురు. పిదప భయపెట్టి నేర్పుదురు. అదియే వృద్ధిపొందును. లేనిచో నిర్మలముగా నుండుబాలుర హృదయాలవాలమున నీయసత్యవిషబీజ మెట్లుమొలకెత్తును? వానిచేతిలో నున్నవస్తువునే, యెదుటివారితో 'లేదని చెప్పు నాయనా ?' యని చంకబాలుని కసత్యాక్షరముల దిద్దఁబెట్టు తల్లిదండ్రులు కూ్రరరాక్షసులు గారా?

ఎవరైన నేదేనివస్తువు నడిగిన నింట నుంచుకొనియే పెద్దవారు లేదని చెప్పుదురు. వెంటనే యారహస్య మెఱుఁగనిబాలకుఁడు 'అదిగో నాన్నా. అక్కణ్ణె వుంది' అనును. వెంటనే గోడచా టున నాబాలునికి-'పండ్లు గొఱుకులు-వషట్కారములు-వీప ప్పుచ్చులు. ఇది బాలుని కసత్యమాడుమని నేర్పుట కాదా? దుర్గుణకవచమును దొడుగుట కాదా? అధఃపతనమున కభి ముఖుని జేయుట కాదా ? ఇట్టివారు రక్షకులా ? భక్షకులా? తల్లిదండ్రులా ? దయ్యములా ? బిడ్డలను మంచివారిని జేయు టకు మునుముందు తల్లిదండ్రులు సుశిక్షితులు కావలయును. సత్యసంధుఁ డొకప్పుడు బొంకవలసివచ్చినచో మనస్సుతో ముందు పోరాడును. కలఁతఁజెందును. ఆపి్రథమయుద్ధమునందు

సత్యము జయించెనా - ఇఁక వాఁడెన్నటికి నసత్యపంకమునఁ గాలువెట్టలేఁడు. ఒకసారి బొంకెనా, యిఁక సత్యపటుత్వము తగ్గిపోవును. ఒకసారి యనృతమాడఁగల్గెనా, యిఁక నెన్ని సారులకును వెలువఁడు. అసత్యమును గప్పుట కసత్యమ కావలయును. ఆరెండవయసత్యమును గప్పుటకు మూఁడవయసత్యము కావలయును. ఇఁక నీయసత్యపరంపర కంతము కలదా ? పట్టుపురువు చుట్టులేసుమీ.

కొందఱు స్వకార్యధురంధరు లోరులఁ బీడించి యనృతమాడింతురు. పరులకు నష్టిలేనిబొంకు బొంకు కాదనియు శుక్రుఁడంతవాఁడే యవసరమువచ్చినపుడు బొంకినఁ బాపములేదని చెప్పెననియుఁ, జాణక్యుఁడంతమహాత్ముఁడును శిష్యుల కసత్యమాడ నేర్పెననియు, నేవేవో పిచ్చిశాస్త్రముల నేకరువు పెట్టుదురు. అవి యన్నియు నవివేకులజల్పనములు.

ఒకవిద్యార్థి పాఠశాలను దెలువకముందే బడికిఁబోయి యట నుండి యాడుకొనఁబోయి బడివిడుచువేళ కింటికి వచ్చెను. వానిసంరక్షకులు బడికిఁ బోయి వచ్చితివా ? యని యడుగ వాఁడు వెళ్లివచ్చితి ననును. ఈయుత్తరమునం దసత్యము లేదు. ఒరులకు నష్టిలేదు. కనుక నిది సత్యమా? సత్యము ధర్మబద్ధమై మనోభావములఁబట్టి యుండునుగాని వాక్యమత్కారములంబట్టి శ్లేషార్థాంతరములంబట్టి యుండదు.

న్యాయస్థానమున సాక్ష్యము చెప్పువారిని బోనెక్కుటతోడనే 'దేవునియెదుట అంతా నిజము చెప్పుతాను. అబద్ధము చెప్పను' అనుప్రమాణము చేయింతురు. ఒకసాక్షి యసత్యములనే చెప్పి యీవలకు రాఁగా మర్మజ్ఞుఁ డొకఁ డేమిరా ! ప్రమాణముచేసికూడ నసత్యమాడితి వన నతండు నవ్వి నే నేమని ప్రమాణముచేసితిని ? 'దేవుని యెదుట అంతా నిజము చెప్పుతానూ ? అబద్ధము చెప్పనూ?' అనికదా నే నంటి నని తల యూడించును. ఇదియు సత్యమే కాఁబోలు ! 'ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః" అనికదా పెద్ద లనిరి. సత్యాసత్యముల నిర్ణయించునది మనస్సుగాని మాటకాదు.

సత్యముయొక్క చరిత్ర మతిగంభీరమైనది. దానిరహస్యమును గనుఁగొంట మిక్కిలికష్టము. అది యొకప్పుడు బయటి కసత్యముగాఁ గన్పించుచుండును. లోన సత్య ముండును. అట్లే యసత్యముగూడ బయటికి సత్యముగా గోచరించుచుండును. వీనిభేదమును మహామతులు ధర్మసాహాయ్యమున నెఱుఁగుచుందురు. కొంద ఱొరు లెవ్వ రెఱుఁగరుగదాయనియుఁ గొందఱు పరులకు భయపడియు బొంకులాడుదురు. మదిలో మాత్ర మేడ్చుచుందురు.

దుష్యంతుఁడు

దుష్యంతుఁడు వేఁటకుఁ బోయి కణ్వాశ్రమమున నొంటిగానున్న శకుంతలను గాంధర్వవిధిం బెండ్లాడి 'ఎల్లి పరిజనులను

బంపి నిన్ను రప్పించుకొనియెద' నని చెప్పి యామె నచ్చటనే డించి స్వపురమున కేగియూరకుండెను. కొంతకాలమున కామె దుష్యంతునిపాలికి రాఁగా నతండు నిరసించి 'నిన్నెఱుంగను. నీ వెక్కడిదానవో ! పొమ్ము' నెను. అప్పుడు శకుంతల యిట్లనియె.

'మహాప్రభూ ! మనరహస్యపుటాడంబడిక నెవ్వరు నెఱుంగరని మీ ధైర్యము కాఁబోలు!

చ. విమలయశోనిధీ ! పురుషవృత్త మెఱుంగుచునుండుఁ జూవె వే
దములును బంచభూతములు ధర్మవు సంధ్యలు నంతరాత్మయుఁ గా
యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా
ర్థము లివి యుండఁగా నరుఁడు దక్కొనఁ నేర్చునె తన్ను మ్రిచ్చిలన్.

ఓనిర్మలకీర్తిమంతుఁడా ! ఋగ్యజురాదిచతుర్వేదములును, భూమ్యాదిపంచభూతములును, ధర్మము, ఉభయసంధ్యలు, అంతరాత్మ, యముఁడు, చంద్రుఁడు, సూర్యుఁడు, పగలు, రాత్రి - యివి మానవుని ప్రవర్తనమునకు సాక్షులు. ఇవి యున్నంతవఱకు వీనికిఁ దెలియకుండ నరుఁడేపనియుఁ జేయ లేఁడు. మనవివాహకాలమున మూఁడవ మనుజుఁ డెవ్వఁడును లేఁడుగదా ? ఈవివాహమునకు సాక్షు లెవరు ? అని త్రోసి వేయఁదలంచితివి కాఁబోలు. ఎంతలో బొంకితివి ?

సీ. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావ

ఎఱుఁగు మెల్లధర్మములకు నెల్లఁ బెద్ద
యందురు సత్యంబు ధర్మజ్ఞు లైనమునులు.

అన్ని తీర్థయాత్రల సేవించినను, నాలుగువేదములఁ జదివినను సత్యమునకు సాటికావు. అన్నిటికంటె సత్యమే యుత్తమమైనధర్మమని ధర్మరహస్యము నెఱింగినమునులు పలుకుదురు.

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్కసత్యమును నిరుగడలం
దుల నిడి తూఁపఁగ సత్యము
వలనన ములునూపు గౌరవంబున పేర్మిన్.

ఒకత్రాసులో నొకవైపున వేయియశ్వమేధయాగములఫలము నుంచి, మఱొకవైపున నొక్కసత్యఫలము నుంచి, తూఁచినచో సత్యఫలమే మిన్నయని త్రాసుముల్లు చూపించునుసుమా. సత్యమున కున్నగౌరవము మఱొకదానికిఁ గలదా ? మీ రెంత ధనమును సత్కర్మములకు వినియోగించినను సత్యమువలన లభించుపుణ్యమును బడయఁగలరా ?

చ. నుతజలపూరితంబు లగునూతులు నూటికంటె సూనృత
వ్రత ! యొకబావి మేలు; మఱిబావులు నూటికంటె నొక్క స
త్క్రతు వది మేలు; తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు; త
త్సుతశతకంబుకంటె నొకసూనృతవాక్యము మేలు సూడఁగన్.

మంచినీరు గలనూతులను నూటింటిని ద్రవ్వించుటకంటె నొకబావిని ద్రవ్వించుట మేలు. అట్టిబావుల నూటింటిని ద్రవ్వించుటకంటె నొక్కయజ్ఞముఁ జేసిన మేలు. అట్టియజ్ఞముల

నూటింటి నాచరించిన దానికంటె నొక్కతనయుని గనుట మేలు. అట్టితనయుల నూర్గురఁ గనుటకంటె నొక్కసత్య వాక్యముం బల్కినఁజాలు. ఇంతపుణ్యము లభించును. పరులు పరిహాసముచేయుదురని ప్రాణకాంతను బరిత్యజింప బద్దులు పల్కెదవా? ఏమి? నేను నీభార్యను గానా? నానందనునకు యౌవరాజ్య మిత్తునన లేదా ?' అని యేడ్చునప్పు డాకాశవాణి 'సత్యము, సత్యము, సత్య' మని ముమ్మాఱుపలుక సభ్యులు హర్షించిరి. అప్పుడు

గీ. "అన్య లెఱుఁగమిఁజేసి లోకాపవాద
భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతి దప్పి
యెఱుఁగనంటి ... ... "

నని యామెను దుష్యంతుఁడు పరిగ్రహించెను.

కొందఱు నవ్వులకు దబ్బరలాడుదురు. అదియుఁ గూడదు. నిప్పుతోఁ జెరలాటములా ? సత్యముతో నవ్వులాటలా ? ఒకగొల్లపిల్లవాఁడు గొఱ్ఱెలఁ గాయుచుండి నవ్వులాటకుఁ దోఁడేలు వచ్చె-వచ్చె-ననియఱచెను. చెంతనే పనిచేయుచున్న తనబంధుగులు కఱ్ఱలు దీసికొని పరుగెత్తి రాసాగిరి. వారి సల్లంతన బాలుఁడు చూచి నవ్వసాగెను. వారదియంతయు నట్టిదే యనుకొని యచటినుండి తిరిగిపోయిరి. ఆవల నిజ ముగాఁ దోఁడేలు వచ్చెను. అప్పు డాబాలుఁ డఱచెను. కాని వానిబంధుగులు పరిహాసమున కఱచుచుండె ననుకొని రాక

పోయిరి. తోఁడేలు వచ్చి బాలుని గఱచి గొఱ్ఱెపిల్లలను గొనిపోయెను.

కనుకఁ బరిహాసమునకును బద్ధులాడఁగూడదు. ఒకసారి బొంకిన నిన్ను మఱొకసారి యెవ్వరు విశ్వసింతురు ?

అబ్బాయీ ! అసత్యము నంటకుము. దానిరుచి తాత్కాలిక మైనదే. అసత్యమాడఁ బ్రోత్సహించినవారుసయితము తుదకు నిన్ను నిందింపఁదొరకొందురు. తమకు విరోధియైనను సత్యవంతుని బొగడుచుందురు.

అగ్నిహోత్రుఁ డొకప్పుడు సత్యముపలికిన శాపమువచ్చునని యెఱిఁగియుండియు సత్యమునే చేపట్టి శాపతప్తుఁడగుట యేలనో యించుక యోజింపుము. ఎందఱునైన భరింతుఁగాని సత్యహీనునిమాత్రము భరింపలేనని భూదేవి బ్రహ్మతోఁ బలికినదఁట.

అసత్యపాప మిహాపరలోకములఁ బీడించును. అది స్వజనము చేతను బరజనముచేతనుగూడ దూషింపఁబడును.

సత్యవాది సత్యమును గౌరవించుటకేమికాని యసత్యవాది కూడ "నేను సత్యవంతుఁడనే" యని బహిరంగముగా నా సత్యమునే గౌరవించుచుండుట యేల? ఒక్కఁడైన బహిరంగముగా 'నే నసత్యవాదిని' అని ధైర్యముగాఁ జెప్పసాహసించునా? అసత్య మధమాధమమైన దగుటచేత నేకదా దానియందు లోకమున కింతనిరసనభావము.

బాలుఁడా! అసత్యమువలన వచ్చుననర్థములు నీకు నిత్యానుభూతములే యగుటచే నేను మరలఁ జెప్పనేటికి ?

సత్యము పవిత్రమైనదని గ్రహించి నీవు 'నేఁటినుండి నేను సత్యమునే పల్కెదను' అని ప్రతిజ్ఞచేయుము.

ఎల్లప్పుడు నేను పల్కుమాటలకు భగవంతుఁడు సాక్షిగా నుండు నను విషయమును స్మృతిపథమున నుంచుకొనుము. సత్యవాదులతో స్నేహము చేయుము.

సత్యమాడుట పరమధర్మమని పరులకు బోధించుచుండుము. అసత్యమాడవలసివచ్చినచో నీనిర్మలమైన హృదయమును ముందుగా నడిగి తెలిసికొనుము.

మితముగా మాటలాడుట నభ్యసింపుము.

## ౨. సంతుష్టి

బాలుఁడా! మానవునకు 'సంతోషము సగముసత్తువ' సంతోషమువలననే ముఖమునందు నూతనవికాసము విరాజిల్లును. నేత్రములయందు దివ్యకాంతులు తేజరిల్లుచుండును. దేహమునందు రక్తము పరిశుభ్రముగాఁ బ్రవహించుచుండును.

సంతుష్టి మనస్సమాధానమువలన నేర్పడును. మనస్సమాధానము వివేకమువలనఁ గలుగును. వివేకము శాస్త్రమువలన జనించును.

గోచిపాతరాయనిజూచి కుచేలుఁడు సంతసింపవచ్చును. భిక్షా శనుని జూచి కూలివాఁడు హర్షింపవచ్చును. లక్షాధికారిని జూచి కోటీశ్వరుఁ డుబ్బవచ్చును. కాని లోకమునకుఁ బైచూపే పట్టువడుటచే సంతోషసౌఖ్యమును జూడఁగాన లేకున్నది.

తనసంతోషమే స్వర్గము. తనదుఃఖమె నరకము. మానవుఁడు సంతుష్టివలన మర్త్యలోకమునకే స్వర్గలోకము చేయవచ్చును. పరుసవేదితో నినుమును బంగారముచేయుట లేదా ?

తా నున్నచోటనే తుష్టిసుధను దావలేక మూఢనరుఁడు మెడ యెత్తి మింటివంకఁ జూచుచు మిడుకుచుండును.

కొందఱు బీదవారికి సౌఖ్యము లేదనుకొందురు. అది లేకున్న లేకపోవునుగాక సంతుష్టిమాత్ర ముండును. సంతుష్టి యున్న సంతోష మున్నట్లే. ఒక్కటే మాట. సంతోషము లేనిజీవి యొక్కనిముసమేని యిచట జీవింపలే దనుకొనుము.

సంతుష్టుఁ డైనదరిద్రునకు సౌఖ్యము కలదుకాని యసంతుష్టుఁ డైనధనికునకు సౌఖ్యము లేదు. చెట్టుక్రింద గంజి కాఁచుకొని త్రాగి చింపిరిగుడ్డలతో ఱాలపై శయనించుకూలివారల కున్న యానందము చుక్కలఁదాఁకుచున్న మేడలలోఁ బంచభక్ష్యపర మాన్నము లారగించి హంసతూలికాతల్పముల శయనించు మహాధనవంతుల కుండదు. వానికెప్పుడును ధనార్జనమునకు-ధనరక్షణమునకు-ధనవ్యయమునకుఁ దీఱనిదుఃఖమే.

### కూలివాఁడు

ఒకధనికుఁ డొకసన్యాసిని దర్శించి "అయ్యా! నామేడప్రక్క గుడిసెలో నున్నకూలివానికిఁ గలమనశ్శాంతి, యెంతధనమున్నను నాకు లే దేమనియడిగెను. దానికాసన్యాసి ధనమే కారణమనెను. ధనికుఁడు వెంటనే 'అయ్యా! ధనమూలమునఁగదా నేను సమస్తభోగముల ననుభవించుచున్నది. అట్టిధనమే నా దుఃఖమునకుఁ గారణమెట్లయిన' దన నాసన్యాసి నవ్వి తొంబది తొమ్మిదిరూపాయలమూటను వానిగుడిసెలోఁ బడవేసిరమ్మని చెప్పి రెండుదినముల కియిర్వురు గుడిసెయొద్ద కేగిరి. కూలి వానిముఖము విచారగ్రస్తమై యుండెను. సన్యాసి వానితో నేలఖిన్నుఁడవైయుంటివన నతం డిట్లనియె. 'అయ్యా! నాకు రూపాయలమూట దొరికినది. అందు తొంబదితొమ్మిదిరూప్యములుమాత్రమే యున్నవి. నూటి కొకటి తక్కువగదా. నూఱు చేయుటకుఁ గూలిడబ్బులఁగూడఁ బెట్టుచు మే మందఱము నేఁడు పస్తుంటిమి. మఱియు నీరూపికల నెవరేని దొంగిలింతురేమో యనియు, నెవ్వరికే నప్పిచ్చినఁ దిరిగి యియ్యరేమో యనియుఁ జింతించుచుంటిని. ఇది యిట్లుండఁ బిల్ల లేవేవో వస్తువులఁ గొనిపెట్టుమనియు, భార్య సొమ్ములు చేయింపు మిది నేను ముందుఁజూచితిని గనుక నాసొమ్మనియుఁ బీడించుచుండిరి. ఈ కారణములవలనఁ జింతాక్రాంతుఁడనై యుంటిని.' ఈమాటలవలన ధనికునిసందియము తొలఁగెను.

కనుక నాశాపిశాచము హర్షమును బాఱఁద్రోలును. ఆశ నణఁచివేసినఁగాని తనివి కలుగదు. తనివి గల్గినఁగాని సంతసము గల్గదు. సంతుష్టి గల్గినఁగాని తనివి కల్గదు. తనివి గల్గినఁగాని తలఁపు లణఁగవు. ఆశ సంతుష్టికి వేరుపురుగు. సంతుష్టి యాశకు గొడ్డటిపెట్టు.

## వామనుఁడు

బలిచక్రవర్తి యజ్ఞముచేయుచుండ వామనమూర్తి యరుదెంచి మూఁడడుగుల నేలనుమాత్రమే యాచించెను. అప్పుడు బలి నవ్వి యడుగఁదలఁచి కొంచె మడిగితివా, యేమి? బిడియము వదలి యిష్టమువచ్చినంత యడుగుము. నీ కేది కావలసినను లేదనక తప్పక యిచ్చెదను. దాతపెంపుసొంపు దలఁచియైన మిక్కిలి గోరుకొనుమన వామనుఁడిట్లనియె. "అయ్యా! నాకుఁగావలసినంతవఱకు నడిగితిని. ఆమూఁడడుగుల నిచ్చిన ముల్లోకములఁగాంచినంత యపరిమితసంతోషము నందెదను. అంతకంటె నెక్కువ వలదు.

క. వ్యాప్తిం బొందక వగవక
ప్రాప్తం బగులేశమైనఁ బదివే లనుచున్
దృప్తిం జెందనిమనుజుఁడు
సప్తద్వీపములనైనఁ జక్కంబడునే ?

అధికము గోరఁగూడదు. ఎక్కువ రాలేదని యేడువఁగూడదు. దొరికినదే పదివే లనుకొని తృప్తిపడవలయు. అట్లు తృప్తిపడ

నివాఁ డేడుదీవుల నేలదొరికినమాత్రము సంతసించునా? ఆశకు మితి కలదా ?

శా. ఆశాపాశము దాఁ గడున్ నిడుపు లేదంతంబు రాజేంద్ర! వా
రాశిప్రావృతమేదినీవలయసామ్రాజ్యంబు చేకూరియుం
గాసింబొందిరిగాక వైన్యగయభూకాంతాదులు స్వర్థకా
మాశంబాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే ?

ఓచక్రవర్తీ! ఆశ యనుత్రాడు మిక్కిలి పొడవైనది. దాని కంతమే లేదు. వైన్యుఁడు, గయుఁడు మొదలగునరపాలురు సమస్తభూమండలము నేలుచున్నను దృప్తిసెందిరా ! ఆసను వదలఁ గలిగిరా ? ఇంతకంటె సిరుల నభివృద్ధిసేయవలయున నియే చింతింపసాగిరేకాని యంతటితోఁ దృప్తిపడిరా ?

సీ. సంతుష్టుఁ డీమూడుజగములఁ బూజ్యుండు
సంతోషి కెప్పుడు జరుగు సుఖము
సంతోషి గాకుంట సంసారహేతువు
సంతసంబున ముక్తిసతియు దొరకు
పూఁటపూఁటకు జగంబుల యదృచ్ఛాలాభ
తుష్టిని దేజంబు తోన పెరుఁగు
పరతోషహీనతఁ బ్రభ సెడిపోవును
జలధార ననలంబు సమయునట్లు
నీవు రాజ వనుచు నిఖిలంబు నడుగుట
తగవుగాదు నాకుఁ దగినకొలఁది
యేను వేఁడికొనినయీపదత్రయమును
జాల దనక యిమ్ము చాలుఁజాలు.

లభించినదానితోడనే సంతుష్టిఁజెందువాని నందఱుఁబూజింతురు. వానికెల్లప్పుడును సుఖము కలుగుచుండును. తుష్టిలేక, తలఁపుల దొంతరలుపెట్టునతఁ డాకోర్కుల ననుభవింపఁ బుట్టుచుఁ జచ్చుచు నుండవలయును. తుష్టి గలవానికి వాంఛ లుండవు గనుక మోక్షమును లభించును. ఏది లభించిన నదియే పదివే లనుకొని తుష్టినెందువాని కనుక్షణము తేజము వృద్ధిపొందు చుండును. నీటిధారచే నిప్పు నశించునట్లు తుష్టివలనఁ గాంతి తగ్గిపోవును. నీవు గొప్పరాజువుగదా యని యున్నదంతయు నడుగుట నాకు ధర్మముగాదు. నాకుఁ దగినంత నే నడిగితిని. తమరు బదులుచెప్పక యీమూఁడడుగులనేల నాకిండు. తృప్తి నెంచెదను.

అంతట బలి వానికోర్కెను దీర్చెను. కనుకఁ దృప్తి యత్యావశ్యకము. నా కధికారమున్నచోఁగాని నాకు ధనమున్నచోఁగాని యధికసౌఖ్యముల నందుదునుగదా యని యువ్విళులూరకుము. అధికారులు ధనికులు పైకిమాత్రమే సంతుష్టులుగాఁ గన్పింతురుగాని లోన దుఃఖాగ్నులచేఁ గుమిలికుమిలిపోవు చుందురు.

ఈశ్వరుఁ డిచ్చినదానినే మహాప్రసాదమనుకొనుట జ్ఞానము. లేనిది కోరిన రాదు. ఉన్నది కోరకున్నఁ బోదు.

భగవంతుఁడు నీవు నీచేతులతో నిర్మించుకొనినకర్మపాత్రతోడనే నీకు ఫలము గొలిచియిచ్చుచుండును. సుఖములు నీవుసంపా

దించుకొనినవి, గష్టములు భగవంతుఁ డిచ్చినవి కావు. కష్ట ములు నీదుష్కార్యపంకము నింకింపవచ్చినసూర్యభగవానుని కిరణములని భావింపుము. కష్టములలో సంతోషమును జూడఁ గల్గితివా యటుచేతిలో దేవుని జూడఁగలవు. ఆశను స్పృశించి తివా దురదగొండియాకును దాఁకినట్లే. ఆశను బుజ్జగించి తివా మద్యమును ద్రావినట్లే. ఆశ కాలకూటమువంటిది. దానికిఁ బరోపకారపరత లేదు. ఆశ యిసుకపాతరవంటిది. దాని కంతము లేదు.

ముదుసలి

ఒకముసలమ్మకడకు మృత్యుదేవత వచ్చి రమ్మనెను. ఆవృద్ధు రాలు 'అమ్మా! రాక తప్పించుకొని యెక్కడకుఁబోఁగలను. కాని నాకు మనుమని మొగము చూచి రావలెనని యాస యున్నది. అంతవఱకు నాగి నన్ను రక్షింపు' మని వేడుకొనెను. మృత్యువు సమ్మతించి కొంతకాలమునకు వచ్చి యిఁక రమ్మ నెను. ఆమె 'అమ్మా! నమస్కారములు. ఇంతవఱకు నాగి దయచూపితివి. ఆమనుమని పెండ్లి చూచి రావలయునను కోరిక యున్నది. దానినిగూడఁ దీర్చి పుణ్యముఁగట్టుకొ' మ్మని వేఁడ మిత్తి వల్లెయని పోయి మఱికొంతకాలమునకు వచ్చి రమ్మ నెను. అపు డాయవ్వ 'తల్లీ! వందనములు. స్త్రీవికనుక స్త్రీ వాంఛల నభిమానంబునఁ దీర్చితివి. ఇం కెంతకాలమో కోరను.

మునిమనుమనిపుట్టుకఁగూడఁ జూచిరావలెనని యున్నది. ఈ కొంచెముమాటను దక్కించుకొనుమని యేడ్చెను. మృత్యువు నవ్వుచు సరియేయని పోయి మఱికొంతకాలమునకు వచ్చి నీ కోర్కె నెఱవేఱెఁగదా? ఇఁక వత్తువా యన నామె 'అన్నా! పదివేలవందనములు. వచ్చుచున్నాను. ఆమునిమనుమని పెండ్లి కొంచెము కానిమ్ము' అనుచుండ నీయాసలకు మేర లేదు. ఇఁక నోరెత్తక నడువు మని, యీడ్చుకొని పోయెను. వింటివా? ఇది ప్రాణాశ. ఇట్టే ధనాశ, ఇంకొకయాస, ఇంకొకయాస. ఆస లెన్నియని చెప్పఁగలను? తలఁపుల నిసుక రేణువుల నెవరు లెక్కింపఁగలరు? ఆశయే బంధము-సంతుష్టియే మోక్షము.

బాలుఁడా! లభించినదానితోఁ దృప్తినొందుము. మంచము న్నంతవఱకేగదా కాళ్ళుముడుచుకొనునది. అది లేకపోయె నిది లేకపోయె నని వగవకుము. పెట్టినమ్మకుఁ బుట్టినదే సాక్ష్యము. పూర్వజన్మమున దానధర్మములు చేయవైతివి. నేఁడు ధనికుఁడవు కాఁగోరిన నెట్లయ్యెదవు? విత్తొకటి వేసినఁ జెట్టొకటి మొలచునా?

### 3. మితి

బాలుఁడా! మితినిగూర్చి చదువుకొని దానిని మననముచేసికొని యట్లాచరింపఁ గడంగుము.

మితియన హద్దు-మేర-కొలఁది. మితి మించి యేపనియుఁ జేయ రాదు. ఏమాటయుఁబల్కరాదు. ఏవిధమునను బ్రవర్తింపరాదు. మితి మానవులకు శ్రీరామరక్ష. మితి యారోగ్యమందిరము. మితి భగవదాజ్ఞ. మితిమీఱిన దైవాజ్ఞను దాటినట్లే. దరిలేని కూపమునుద్రవ్వికొనినట్లే. భరింపరానియాతనలఁ బైవేసి కొనినట్లే.

మితభుక్తిని జాగరూకుఁడవై యభ్యసింపుము. రుచికరము లైనపదార్థములుగదా యని యమితముగా భుజింపకుము. అమితభుక్తివలన నజీర్తి యజీర్తివలన నఖిలరోగములు నలము కొనును.

కడగాఁబోవుదానిని గాళ్లమీఁదికిఁ దెచ్చికొనినట్లు కుడిచి కూర్చుండలేక యమితత్వము నంపి మృత్యుదేవతను బిలిపించు కొనుమూఢమానవులను జూడ నాశ్చర్యమగుచున్నది.

నీచవైద్యుని నిగ్రహింపఁగోరెదవేని మితభుక్తి యనుబ్రహ్మాస్త్ర మంత్రమును బఠింపుము. వానిపాదముల సమీపమునఁబడి దేవురించుట హీనకార్యమని తలంతువేని మితభుక్తివిమాన మున విలాసముగా విహరింపుము. తుష్టియుఁ బుష్టియుఁ గల్గును.

అటుచూడుము. బాలుఁడా! ముఖమున నెవ్వగ వ్రేలాడ, హృదయమున ననుత్సాహము క్రీడలాడ, నుసూరుమను చున్నవా రెవ్వరో యెఱుఁగుదువా?

" అంగడిలో నన్ని యున్నవి, యల్లునినోట శని యున్నది" అన్నట్లు సమస్తపదార్థములు నింట నున్నవి; కాని లాభ మేమి? వారిదురదృష్టదేవత కంట్లెఱ్ఱచేయుచున్నది. వ్యాధి కాలసర్పము ఘూత్కారముసల్పుచున్నది. వారెవ్వరో యెఱుంగుదువా?

మూల్గుచు ముక్కుచు శూన్యదృష్టుల దెసలవిసరుచు, శల్యావశిష్టులై వైద్యులచేతికీల్బొమ్మలై యున్నవారెవ్వరో యెఱుంగుదువా? నాయనా! వారే యమితభుక్కులు. జీర్ణము కానేరదనియేని చింతింపక, యాయాసమనియేని యాలోచింపక యమితముగా భుజించి యాఫల మనుభవించుచున్నారు. వీరికిప్పుడు తొల్లిటి సరసపదార్థములు నీరసములైనవి. జిహ్వ చెప్పినమాట వినదు. ఆస నదిమిన నడంగదు. శౌర్యవిహీనునిచేతి శాతకరవాలములవలెఁ బ్రాణమును రక్షించునవే ప్రాణమును భక్షించుచున్నవి. ఏమి మాహాత్మ్యమో ? ఏమి సౌఖ్యమో ? దోసిలివట్టి మంచినీరువలె నాజ్యధారలఁ ద్రావి యరగించుకొనలేక యాయాసపడుచు బావులలోఁబడి తపనము నపనయించుకొనుచున్నారు. అడుసు త్రొక్కనేల ? కాలు గడుగ నేల ? అగ్నిహోత్రుఁడంతవాఁడే యమితభుక్తి నరిగించుకొనలేక యర్జును నాశ్రయింపవలసివచ్చినది.

సాధారణముగా శిశువుల కజీర్ణరోగముతప్ప మఱొకరోగము రాదు. కారణము తెలిసినదా ? తల్లి వానిజీర్ణశక్తిని దెలిసి

కొనలేక యెక్కువపాలు నోటఁ గ్రుక్కుటవలననే. నోరులేని యాశిశువు చాలునని చెప్పటకో యన్న ట్లేడ్చుచున్నను గ్రహింపలేక బుగ్గలను బులిమి బలాత్కారముగా నోరు పగులఁ దీసి పోయుటయే పోయుట. "ఎక్కువతిన్న మిక్కిలితొందరగా మాయబ్బాయి పెరుగు"నన్న యాసయే యామెకు మిక్కుటము.

బాలకుఁడా! అంతదూర మేల? నీతల్లి నీకమితముగా వడ్డించునా, లేదా? నీ వామెయవివేకమును బోఁగొట్టి నీజీర్ణశక్తి నెఱింగి మితముగా భుజింపుము. భోజనానంతర మది జీర్ణమగుట కొకపాలు రిక్తకోశ ముండవలయుననుటను మఱచి పోవకుము. 'శిష్యా! శిష్యా! పాదరక్ష లెచ్చటనున్నవిరా' యనఁ బొట్ట వంగకపోవుటచేతఁ జూపులు నేలమీఁద వాలకున్నవండి' అనునట్లు భుజింపరాదు. అన్నము దినిన పిమ్మట నడక కాటంక ముండరాదు. నడవలేకపోతివా యది మితిమీఱినభోజనమనియే గ్రహింపుము.

అమితభోగము లారోగ్యభంగకరములు. మితభాషిత్వము శీలరక్షకము. మితభాషి కెప్పుడు నవమానకంటకములు గ్రుచ్చుకొనవు. ఆత్మశక్తి యంతరింపదు. అనృతభూత మావరింపదు. అనర్థము లాపాదింపవు.

మితిమీఱనిభాషయం దర్థగౌరవము శబ్దసౌష్ఠవము నుండును. సూర్యబింబము కలువకన్నకు దాయగాను, దమ్మిచెలువకు

మిత్రముగను, లోకమునకుఁ జుట్టముగను గన్పట్టునట్లు మితమైనమాట యపరాధులకు హృదయకుఠారముగను, నాత్మీయుల కాహ్లాదకరకుసుమముగను, సభ్యులకు సచ్ఛాస్త్రముగను గోచరించుచుండును.

మితభాషిత్వము తనలోపములను మేల్ముసుఁగువలెఁ గప్పివేయును. అయ్యది తనయవివేకమును మేఘము రవినిమాడ్కి నాచ్ఛాదించును.

మితభాషి యొరులకోపావేశములకు గుఱికాఁడు. తమకనిష్టమైనను శత్రువులు మితభాషిని నిందింపసాహసింపలేరు. మేఘములలోనియింద్రజిత్తువలె మితభాషి యొరులకుఁ జిక్కఁడు.

రాజులు కార్యవేదియైనమితభాషి నేఱి రాయబారముల కంపెదరు. పనుల నెరవేర్చుకొనుటకు సదుపకరణము మితభాషణము. ప్రల్లదుఁడు రహస్యముల దాఁచుకొనలేక స్వకార్యములనే చెడఁగొట్టుకొనును. ఇఁకఁ బరకార్యములఁ జెదపుర్వువలెఁ జెడఁగొట్టునని చెప్పవలయునా ? పెదవి దాటినఁ బెన్న దాఁటునని సామెత. మాట మిగిలిన దాని నెట్లు నరుఁ డాకర్షించుకొనఁగలఁడు? అర్జునుఁడుగాని రాముఁడుగాని నారివదలిన బాణముల రప్పించుకొనఁగల్గిరి; గాని నోరువదలిన భాషణముల రప్పించుకొనఁగలిగిరా ? ఇఁకఁ బెరలఁ దడవవలయునా ? ప్రలాపికిఁబదుగురలో గౌరవములేదు. వానిమాటలకు విలువ లేదు. ప్రల్లదునకు నిత్యము కోపము - తాపము - పశ్చాత్తాపము - ముమ్మరముగా ముప్పిరిగొనుచుండును.

నోటికి వచ్చునట్లు ప్రేలి యొరులచే దూషింపఁబడి చేయునది లేకలోలోనఁగుమిలికుమిలి యేడ్చుట యుచితమైనకార్యమా? మూరెఁడు పోనేల? బారెఁడు కుంగనేల? పలికి పలికించు కొనుట ప్రాభవముకాదు. పలికి చెల్లించుకొనుట వైభవము. ప్రలాప మొకరోగము. సన్నిపాతరోగి కొకప్పు డుండునుగాని అవివేకి కెల్లప్పుడు ప్రలాప ముండును. వానినోరు కుట్టినఁ గుదుటఁబడియుండదు. తిరిగెడికాలు తిట్టెడినోరు నిముస మూరకుండునా ?

కొందఱు పరుల నవ్వించుటకై ప్రయత్నించి వాగుచుందురు. కొందఱు తాము గొప్పవార మనిపించుకొనుటకుఁ బ్రేలు చుందురు. ఇట్టివారికిఁ దాఁకునది తప్పునది దెలియదు. అందువలన నొకప్పుడు తత్ప్రత్యులచేతఁ జీవాట్లు తినుచుందురు. బాలుఁ డా! యిది మంచిపద్ధతియని యెంతువా? మితభాషివి కమ్ము. అగుట కభ్యసింపుము. 'మన కెందుకు లెమ్ము; అడిగినప్పుడు చెప్పవచ్చును లెమ్ము; అనవసరముగా నొరులజోక్యమునకుఁ బోనేల' అని తలంచుచున్న నది యలవడును.

మితవ్యయ మత్యంతగౌరవప్రదము. నాయనా! మనయాంధ్రు లిద్దాని నెంతమాత్రము గమనించుటలేదు. మితవ్యయము తమకీర్తికి భంగకరమని పిచ్చితలంపునంబడి కొట్టుకొనిపోవు

చున్నారు. ప్రతికార్యమును మితవ్యయ మనువజ్రకవచముచేఁ బరివేష్టింపఁబడవలయునని మన మెఱింగినచో నాంధ్రావని యింతయప్పులపా లేలకావలసివచ్చును ?

ఆయమును మించి వ్యయముచేయుదురభ్యాస మెంత కాలము మనయందుఁ బాదుకొనియుండునో యంతకాలము మనకు దరిద్రదేవతాదుస్సహాఛీత్కారములు తప్పవు.

మ్రింగ మెదుకు లేదు, మీసాలకు సంపెంగనూనె. కట్టు కనువైనవలువ లేదు, కాల్గదల్చిన మోటారుకారు. పూటకు గతి లేదు, పొద్దునఁ గాఫీ యిడ్డెన్లు - పైఁగాఁ గారాఖిల్లీలు - సిజర్సుసిగరెట్లు, చీట్లపేకలు, సినీమాలు ! చెప్ప సిగ్గగును. "అప్పుసప్పు చేసి పప్పుధప్పళం కొడదామురా" అనెడి రకము. వీరిని సిగ్గు చూచి చెంపలువేసికొనునో యేమో ?

అయ్యో ! ఎక్కడఁజూచిన నప్పులే. ఎక్కడఁజూచిన నదలింపులే. ఎక్కడఁజూచిన నవమానములే. ఎట్లు వీరు బ్రదుకుచుండిరో? ఎట్లు నిదురఁబోవుచుండిరో? ఎట్లు తిరుగుచుండిరో?

బాలుఁడా ! చూడు మామూల 'వారంటు' తెచ్చిన జవాను చేతిలోఁబడి తప్పించుకొనిపోలేక తల్లడిల్లుచున్న యధమర్ణులను. ఇటుచూడుము. తలవంచుకొని చేతులసంకెలలు కన్పడకుండఁ జేయఁబ్రయత్నించుచుఁ గారాగారమున కరుగుచున్న యప్పుపడ్డవారిని. ఆదూరమున దృష్టి సారించుము. ఋణబాధ

పడలేక విషము మ్రింగి మృత్యుదేవతను శరణుసొచ్చినవారిని. అప్పు లేల? ఆత్మహత్య లేల?

క్రిందుమీఁదుగానక యమితవ్యయమద్యము కంఠదఘ్నముగాఁ గ్రోలి యొడలు తెలియక తాతతండ్రిలు సంపాదించినదివ్యక్షేత్రములఁ దెగనమ్మికొని యంతటనైనఁ గడతేఱక యాలిమెడలోని యాభరణముల నమ్మి తీర్చినను ఋణము దీఱమినీహీనస్థితిని బొందిరి.

బాలుఁడా! వీరందఱు మితవ్యయము చేయనివారేయని తెలిసికొంటివా? ప్రిప్రథమమున వీరు భాగ్యవంతులేసుమా.

బాలకుఁడా! నీవు బాగుపడఁగోరెదవేని, నలుగురిలో గౌరవముతో జీవింపఁగోరెదవేని, యభిమానవంతుఁడవేని యాయమును మించినవ్యయము చేయకుము. పిదప రాఁబోవుకడగండ్లనించుక తలంచుకొనుము. కోరికలఁ గుదించుకొనుము.

కొందఱు తమయింటిపనులఁ దాము చేసికొనఁ గలిగియుండియు, సేవకులకు భృతి నీయలేమని యెఱిఁగియుండియుఁ బరులు గేలిసేయుదురని యనవసరవ్యయముల నొనర్తురు. ఒక్కటేమాట. నిన్ను గేలిసేయువా రధికవ్యయదాసులని యెఱుంగుము. బుద్ధిమంతు లెన్నడు గేలిసేయరు. ఒకవేళ నొరులు గేలిసేసినను బ్రిథమపర్యాయమే కాని రెండవతూరి నీవైపేని దొంగిచూడరని గట్టిగానమ్ముము. జేపనునది కలదని యెఱుఁగవా? జేపటి కీదినముననే కూర్చుకొనవలయును.

శ్లో. వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్
నిశార్థ మర్థం దివసే యతేత
వార్ధక్య హేతో ర్వయసా నవేన
పరత్ర హేతో రిహ జన్మనాచ.

వర్షాకాలము నాలుగు నెలలకు మిగిలినయెనిమిది నెలలయందును, రాత్రికిఁ బగటియందును, ముసలితనమునకు వయస్సునందును, పరలోకమున కీవర్తమానశరీరమునందును, వలసిన వానిని గూర్చుకొనవలయును. అప్పటికప్పుడు వెదకికొనిన నెచ్చటినుండి వచ్చును? ధనమందే యిట్లుకాదు. ప్రతివిషయమునందు నిట్లే ముందుగనే జాగరూకతతోఁ బ్రవర్తింపవలయును. మిగులునట్లు వాడనేర్చినవారిగుణము సహజముగా స్వల్పవిషయమందును, స్పష్టపడుచుండును.

దూఁబఱదిండి మంగమ్మ

దూఁబఱదిండి యగుమంగమ్మ కిర్వదినాలుగు గేదెలపాడియైనను జుట్టము వచ్చినపుడు బదులుకుఁ బరుగెత్తవలసియుండును. ఒకసారి మట్టసముగా వాడుకొనునొక గేదెపాడి గలరంగమ్మ దగ్గర మానెఁడు నేయి బదులుతెచ్చి యామె యడిగినపుడు మంగమ్మ పోట్లాడి ' చూచితిరా ? నాదగ్గఱనే యీామె నేయి తీసికొనిపోయి యిపుడు నే నడుగఁగాఁ దనకే నే నీయవలసియున్నదని తగవుపెట్టికొనినది. నానెయ్యి నా కిప్పింపుఁడని న్యాయాధికారియొద్ద ఫిర్యాదుచేసెను. వినువారి

కిది యుక్తముగానే యుండునుగదా. న్యాయాధికారి మర్యాదరామన్న. ఆయన యోజించి బురదగలయూరు మకాము చేసికొని కుంభద్రోణముగా వర్షము కురిసి వెలిసినపిదప వారిద్దఱఁ బిలిపించి వారు మోకాటిబంటిబురదలో నెట్టెటో నడిచి రాఁగాఁ జెఱియొక చెంబెఁడునీ రిప్పించెను. మంగమ్మ యా చెంబెఁడునీరు బడబడ పాఱఁబోసెను. ఒకకాలిమట్టె యించుకైనఁ బోలేదు. రంగమ్మ పదిలముగా బురద పోవునట్లు కడుగుకొనుటయేకాక యింకను నీరు మిగిల్చెను. ఇంతలో మంగమ్మ మఱొక చెంబెఁడునీరు తెమ్మని జవానుతోఁ జెప్పుచుండ రామన్న, యామెతో నింటికిఁబోయి కడుగుకొని రంగమ్మకు మా నెఁడు నెయ్యి పోయుమని తీర్పుచెప్పెను. బుద్ధిచాతుర్యమును గ్రహించితిరా? అలవాటు లెప్పుడు నణఁగిపడియుండవు. అవి ప్రతిస్వల్పకార్యమునందును గన్పట్టుచుండును. నీరును వాడినట్లే మంగమ్మ నేయిని వాడునది. ఆమె కిర్వదినాలుగు గేదెలపాడియైన సరిపోదు. ముప్పదిగేదెలపాడియైన సరిపోదు. మితవ్యయమునకలవాటుపడనివారిస్థితి యిట్లేయుండునది. అట్లని నీవు తినక యొకరికిఁ బెట్టకయుండుమని చెప్పుచుంటినని తలంచెదవేమో. అట్లెన్నటికిని జెప్పను. అట్లుండఁగూడదు. వాడుకలో మట్టస ముండవలయునంటినిగాని లోభితన ముండవలయు ననుటలేదు. బాలుఁడా! మట్టసము నేర్చుకొనినఁ దుట్టతుద

వఱకు సౌఖ్యముల నందెదవు. లేనియెడలఁ గష్టపడియెదవు. జాగరూకుఁడవై యుండుము.

## ౮. కార్యదీక్ష

బాలుఁడా ! ఏపనిని జేయుటకైనను బట్టుదలయుండవలయును. అది లేనిచో నెంతటిస్వల్పకార్యములును నెఱవేఱఁజాలవు. పట్టుదలగలవానిపనులు పాడుగావు. పట్టుదల కార్యసాధనకుఁ బరమోపకరణము. ధర్మార్థకామమోక్షములు పట్టుదలవల ననే కైవసంబగును.

కార్యదీక్ష సోమరితనమును బోఁగొట్టును. దారిద్ర్యమును దఱిమివేయును. కార్యదీక్ష గలవానికడ విఘ్నములు గడగడ లాడును. ఉత్సాహ ముబ్బిపోవును. కార్యసిద్ధులు కరస్థము లగును.

వృక్షము తనను ఛేదించినను మరల మోసుఁదొడుగుచున్నది. చంద్రుఁడు తనయమృతకిరణముల నెండలు గబళించుచున్నను మరల వానిని బూరించుకొనుచునే యున్నాఁడు.

శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచుఁ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరుసుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

'ఈకార్యము సాంతమగునా ? నడుమనే యెన్నియో యంత రాయములు వచ్చును' అని భయపడి యధములు కార్యారం

భమునే యొనరింపరు. మధ్యములుమాత్రము ప్రారంభించి కొంతవఱకుఁ జేసి విఘ్నములు వచ్చుటతోడనే వదలిపెట్టెదరు. పట్టుదలగల ధైర్యవంతులో యెన్నివిఘ్నములైనరానీ తాము పట్టినపని నెఱవేఱనిది యూరకుండరు. తుదముట్టఁ జేసితీరెదరు. వీరే యుత్తములు. బాలుఁడా! నీవు ధైర్యోత్సాహములు రెండు కెలఁకులఁ గైవారము లొందింపఁ బ్రజ్ఞాబలము నూఁత గాని కార్యదీక్ష యను కరవాలమున విఘ్నములఁ దుత్తుని యలు సేయుచు సిదిఁబొందుము.

గీ. తనిసిరే వేల్పు లుదధిరత్నములచేత
　　వెఱచిరే ఘోరకాకోలవిషముచేత
　　విడిచిరే యత్న మమృతంబు వొడముదనుక
　　నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు.

దేవదానవు లమృతముపడయుటకై గట్టిజతనమొనర్చి పాలసంద్రము కుండగాను, మందరపర్వతము కవ్వముగాను, వాసుకి త్రాడుగాను, నేర్పఱిచి త్రిచ్చసాగిరి. అప్పుడు భయంకరమైన హాలాహలము పుట్టి తత్త్రిత్యల భస్మీభూతులఁ జేయసాగెను. దేవదానవు లవ్విఘ్నమును శివునివలనఁ దొలంచుకొని మరల మథింపసాగిరి. అంత వివిధములైనరత్నములు కల్పవృక్షములు కామధేనువుమొదలైన వెన్నియో యపూర్వనిరుపమానవస్తుపరంపరలు పుట్టసాగె. దేవతలు వానిని జూచియే తృప్తిఁబొంది ప్రారంభించిన కార్యము నుజ్జగింపలేదు.

మఱియు రూపలావణ్యవతు లగునప్సరస్సమూహ ముదయించె. వారిని జూచియైనఁ దృప్తిపడి యూరకుండలేదు. అమృత ముదయించువఱకు సజాతీయవిజాతీయాంతరాయములఁ దొలఁగించుకొనుచుఁ జిలికిరి. అమృతరసపాన మొనరించితీఱిరి. పట్టుదల యిట్లుగదా యుండవలయును ? కార్యశూరులు నిశ్చితార్థమును వదలరు.

కార్యదీక్ష గలవాని కాఁకలిదప్పు లుండవు. ఉన్నను లెక్కచేయఁడు. కార్యవాది కాయకష్టమునకుఁ గలఁతనొందఁడు. ధనవ్యయమునకుఁ దపింపఁడు. ఒకచో నేలను బవ్వళించును. ఒకచో తూలపైఁ బవ్వళించును. ఒకచో నొంటిపూట తినును. ఒకచో నుపవాసముండును. తనకార్యసిద్ధినే ప్రధానముగా నెంచుకొనును. పాటుపడును. అంతేకాని చేతులు ముడిచికొని కూర్చుండి దేవుఁడే నా కింటికిఁ దెచ్చిపెట్టునని యూరకుండఁడు.

శ్లో. ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీ
ర్దైవం ప్రధానమితి కాపురుషా వదంతి
దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా
యత్నే కృతే యది నసిధ్యతి కోఽత్ర దోషః.

ప్రయత్నముచేయునరునే భాగ్యము వరించును. కాని ప్రయత్నవిహీనుఁడై దైవమే తనకుఁదెచ్చిపెట్టుననుకొను మూఢుని వరింపదు. కనుక దైవముకంటెఁ బౌరుషము కర్తవ్యము. ప్రయత్నముచేసినను లభింపనిచో నెవరిది దోసము ?

కం. విను పురుషుఁడు గావింపని
పనులకు దైవ మది యెట్లు ఫలమొనరించుఁ
జనములు గార్యము నడపఁగ
ననుకూలత నిచ్చుఁగాక యద్యై ఫలముల్.

పురుషుఁడు పనిచేయకున్న దైవ మెట్లుఫలమిచ్చును ? పురుషుఁడు పనిచేయవలెను; దైవము ఫలమియ్యవలెను.

గీ. పౌరుషంబు దైవంబుతోఁ డ్పాటు లేక
ఫలము నెందంగ నేరదు పార్థివేంద్ర !
విత్తు సహకారి గాకున్న రిత్తనేల
వంధ్య మగుఁగాక తా ఫలవంత మగునె ?

విత్తనముల విత్తకున్నఁ బొలము పండనట్లు పురుషుఁడు పని చేయకున్న దైవము ఫలమీయదు. కనుక రెండు నావశ్యకములు. దైవమీయదేమోయని పురుషుఁడు ప్రయత్నింపకుండరాదు. ప్రియత్నించిన నీయవచ్చు, నీయకపోవచ్చుఁ గాని ప్రియత్నింకున్న నిచ్చుట లేనేలేదుగదా? ఒకసారి ప్రియత్నించిన నీయకున్న రెండవసారి ప్రియత్నింపుము. ఏల యీయఁడో చూతము. ఒకబాలుఁ డొకయేఁడు పరీక్షలోఁదప్పెను. అంతటితో నిరుత్సాహపడి యూరకుంటయేనా కర్తవ్యము? చదివి పరీక్షను సాధించినవాఁడే మగవాఁడు. ఒకఁ డాఱువత్సరములు చదువుచుఁ దప్పుచుఁ గడకుఁ గృతార్థుఁడయ్యె. పట్టుదల యిట్లుగదా యుండవలయును?

బాలుఁడా! కార్యదీక్ష నభ్యసింపుము. కార్యభారమును జూచి ముందుగానే యధైర్యపడకుము. 'ఉపాధ్యాయుఁడిరువది లెక్కలు చేసికొనిరమ్మన్నాఁడే! వీనిని జేయఁగలనా?'అనియధైర్యపడి యూరకుండకుము. మెల్లగా నొక్కొక్కటాయి దీయుచున్నఁ గొండయైనఁ దఱుఁగును. ఇరువది లెక్కలు తఱుఁగుట కేమి?

'రెండువందలపుటలు గలపుస్తకము నెప్పుడు తుదముట్టఁజదివెదను? ఇట్టి వింకను నిరువది గ్రంథములు గలవే? అబ్బో! నాల్గువేలపుటల నేను జదువనోపుదునే? అబ్బా! యీపని నావలనఁగాదు' అని లెక్కించుకొనుచుఁగూర్చున్న నట్టిపరీక్ష నెట్లుకృతార్థుఁడవయ్యెదవు? పుటల లెక్కింపఁబూనక చదువఁబూనుము. అవియే చెప్పకుండ నైపోవును.

బాలుఁడా! 'ఈపనిని జేసితీఱవలయును. ఇది యింతకాలములోఁ దప్పక కావలయును. ఈపని కానిది మఱొకపని చేయను' అని మొండిపట్టుపట్టి శ్రద్ధతోఁ జేసినచో నెన్నిపనులైన నయితీఱును. అది నీమనోధైర్యము-మనోనిశ్చలతలో నున్నది. చీమలు పాఁకిన బండ లఱుఁగును. మానవుఁడు చేసినఁ గార్యములు కావా?

భారతభాగవతాదిమహాగ్రంథముల రచించుట కెంతదీక్ష యవసరమో యెఱుఁగుదువా? కనుకనే తిక్కన్న గండకత్తెరవేసె

కాని గ్రంథము రచింపఁబూనెనని పెద్దలందురు. గండకత్తెర యనఁ గార్యదీక్షయని యెఱుంగుము. నేఁడు ముద్రాయంత్రము లున్నవిగనుక సరిపోయెఁగాని మనపూర్వు లాగ్రంథములకుఁ దాటాకులప్రతుల నెన్ని వ్రాయలేదు? ఆప్రతుల నేఁడు సోమరులమగుమనము చూచి ముక్కుపై వ్రేలుంచుకొనెదము. వారు నీవంటివారు కారా? అన్నియుద్గ్రంథముల నెట్లు వ్రాయఁ గల్గిరి?

మానవున కసాధ్యకార్యములు లేవు. కృష్ణాగోదావరీప్రముఖ జీవనదుల లోఁబఱచుకొనుట సామాన్యకార్యమా? ఎన్ని పర్యాయములు విఘ్నములు గల్గినవో? ఎన్నిపర్యాయములు ప్రారంభించిరో? ఎంతపట్టుదల లేనిది వాని కానకట్టలు వంతెనలు నెట్లేర్పడినవి?

'సాధనమునఁ బనులు సమకూరు ధరలోన' ననినవేమన పిచ్చివాఁడు గాఁడు. గౌరీశంకరము (Mount Everest) నధిరోహింప నెందఱో ప్రయత్నించుచున్నారు. ప్రాణముల నిచ్చుచున్నారు. ప్రాణమును బణముగా నొడ్డి యాకార్యమును సాధింపఁబూనుకొనుట నేమనవలయును?

నిప్పును - నీరును - నేలను-నింగిని - నుఱుమును-మెఱుమును స్వాధీనముచేసికొన ధీరుఁ డెన్నిప్రయత్నము లొనరించుచుండుటలేదు? ఎన్ని చెడిపోవుటలేదు? కాని ప్రయత్నము లాగిపోయినవా?

విమాననిర్మాణమున కెంత పట్టుదల కావలయును? ఆకాశమున విమానముపైనుండి దుమికినను జావకుండనుంట కుపకరణముల నిర్మించుట కెంతదీక్ష కావలయును? ఎంత ధైర్యము కావలయును?

కందుకూరి వీరేశలింగముపంతులుగారి స్వీయచరిత్ర నొకసారి పఠింపుము. విధవా వివాహవిషయమై యాయన యెన్ని యిక్కట్టుల పాలయ్యెనో? ఎంత పట్టుదల వహించెనో? తెలిసికొనఁగలవు. కార్యదీక్ష లేక గొప్పవాఁడైనవాఁ డొక్కరుఁడు లేఁడు?

భగీరథుఁడు

సగరనందనులు కపిలమహాముని కోపాగ్నిచే భస్మీభూతులైరి. తద్భస్మరాసులపై గంగ ప్రవహించినఁగాని వారికి సద్గతిలేదు. అందుకై సగరుని మనుమఁ డంశుమంతుఁడు గంగను దేఁ బ్రయత్నించి నిష్ఫలారంభుఁడై గతించెను. అతనికొడుకు దిలీపుఁడు నట్లేచేసి మృతిసెందె. దిలీపునికుమారుఁడు భగీరథుఁడు దీక్షవెయి తపముచేసి గంగానుమతింబొందె. అంత టితోఁ బని తీఱలేదు. గంగను భరింప శివుఁడు కావలసి వచ్చెను. మరల నాయననుగూర్చి తపముచేసి గంగను దివినుండి భువికిఁదెచ్చె. అంతటితోఁగష్టము తీఱలేదు. ఆగంగను జహ్నుముని తన యాశ్రమమును బాధుచేసెనని మ్రింగివైచెను. మరల భగీరథుఁ డామునిని బ్రార్థించి భస్మరాసులపై గంగను బ్రవహింపఁజేసె. ఇట్టిదిగదా పట్టుదల !

ఒకపనిని బ్రారంభించి కొంతవఱకుఁ జేసి యంతట మఱియొక పనిపై దృష్టిసారింపకుము. అదియే పనిచేటునకు మొదలు. మనశ్చాంచల్యము లేనివాఁడవై యుక్తకాలముల యుక్త కార్యముల నాచరించుచుఁ గాల నిర్ణయపట్టిక (Time table) ప్రకారము వర్తించితివా మంచిదే. అది చేతఁగాదో ఒక కార్యమునే పూర్తిగా సాంతమగువఱకును జేయుము. పిదప మఱొక కార్యమును నారంభింపుము. ఒకపని చేయుచు నడుమఁ గొన్ని దినము లాగితివా ? ఇఁక నదే యాగుట. మరల నాపనికి నీ మనసు విసుగుకొనును. అట్లు చేయకుము. వేడిలో వేడి కా వలసినదే. కనుక నాయనా! పట్టుదల యను వజ్రాయుధముఁ బూని విఘ్నపర్వతముల విచ్ఛేదించుచు యుక్తకార్యముల నాచరించి యశస్విని గమ్ము.

## ౫. ఓర్పు.

బాలుఁడా! "క్షమయా ధరిత్రీ" యనునార్యోక్తిని బాటింపుము. భూదేవినుండి యోర్పును, పయోధినుండి గాంభీర్యమును, వృక్షములనుండి యుపకారమును నేర్చుకొనుము. తల్లియు ధాత్రియు క్షమావతులు గానిచో మనయునికియే యుండదుసుమా!

ఓర్పు విశాలయశోవంతుని జేయును. ఓర్పు కొంగుబంగారము వలె నుచితసమయముల నుపయోగపడుచుండును.

బలవంతుని యోర్పు, దరిద్రుని దానము ప్రకాశముం బొందును. ఎన్ని కల్లోలినులు వచ్చిపడినను మేరమీఱని పారావారము తీరున నెన్ని కష్టములు వచ్చిపడినను క్షమావంతుఁ డోర్చుకొనును. తొందరపడఁడు. తొందరపాటు కొందలపాటును గల్గించును. మిన్ను విఱిగి మీఁదఁబడినను దమకని వాని కెన్నటికిని జేటు లేదు. క్షమావంతుఁడు నిండుకుండ. తొణకఁడు. తనసహధర్మచారిణిని ద్రౌపదిని నిండుపేరోలగంబునఁ గౌరవులు పరిభవించుచున్నను నది యేమి శాంతమో కాని ధర్మజుఁ డించుకయైనఁ జలింపలేదు. అట్లు చలింపకుంట యశక్తత చేతనని యజ్ఞు లందురు.

క. క్షమియించువారిఁ గని చా
లమి వెట్టుదు రైననుం దలంప ననూన
క్షమయ కడుమెఱయుతొడ వు
త్తమరూపముఁ గోరువారు దాల్తురు దానిన్.

ఒరు లొనరించినయపకారముల క్షమించి ప్రత్యపకార మొనర్పనిబలవంతుల నేని శక్తిహీనులని యజ్ఞులు తలంతురు. తలంచినఁ దలంపనిమ్ము. క్షమయే తళతళ మెఱయుభూషణము. దాని నుత్తమమైనరూపము గోరువారే ధరించెదరు.

బాలకా! నీకు శాంతి యున్నచోఁ గవచ మేల? క్రోధ మున్నచో శత్రు వేల? జ్ఞాతి యున్నచో నగ్ని యేల?

ఆపదలు వచ్చినపుడే ధైర్య ముండవలయును. సంపద లున్నపుడే శాంతి యుండవలయును.

చీఁకటి భయమును బయల్పఱిచినట్లు క్షమ యాత్మనిగ్రహము నావిష్కరించును.

విద్యకు వినయము భూషణము. శక్తికిఁ దాల్మి భూషణము.

చ. గురువులరాక, దాసిమృతి, గుఱ్ఱపుదాడియు, వానయిల్పడన్
బొరుగున నప్పుబాధ, చెవిపోటును, ద్రిమ్మరి యల్లుఁడల్కయున్
వరసంగర్భవేదన, వివాహము, విత్తులు చల్లడంబునున్
గఱవు, దరిద్రి, మాబ్దికము గల్గె నొకప్పుడు కృష్ణభూవరా!

శంకరస్వాములవారు వచ్చిరి. ఆజగద్గురువుల భిక్షాదికముచేఁ బూజింపవలయును. పనిపాటలఁ జేయుదాసి మృతిఁజెందినది. మరాటీలగుఱ్ఱపుదండు వచ్చిపడినది. వారల్లకల్లోలము చేసెదరు. వారిని దప్పించుకొనవలయును. వర్ష మింటఁబడుచుండును. పొరుగుననే యున్నఅప్పులవారు బాకీతీర్పుమని పీడించుచున్నారు. చెవిలోఁ బోటు. దానిబాధ చెప్పఁదరముగాదు. దేశద్రిమ్మరి యగునల్లుఁ డెట్టెటో వచ్చినాఁడు గదాయనుకొనుచుండ నతఁ డలిగి వెళ్ళిపోయెదనని బెదరించుచున్నాఁడు. భార్య ప్రసవవేదనపడుచున్నది. వివాహవిషయమై మాట్లాడ నెవ్వరో వచ్చియుండిరి. విత్తనపుటదను. డబ్బు పుట్టుటలేదు. కఱవు పీడించుచున్నది. ధనవంతుఁడను గాదు - దరిద్రుఁడను. ఆబ్దికము వచ్చినది. అది దాటరానిదిగదా. ఇన్ని చిక్కులలో నీదినము నెట్లుగడపెదనయా కృష్ణదేవరాయా! అని

యొకఁడనుచున్నాఁడు. ఇతఁ డెంతటిధైర్యవంతుఁడు క్షమా శాలి కాకున్న నింకను జీవింపఁగలఁడు ?

క్షమాదేవతా ! నీ వ్యాపిరిపోయుదువు. నీకు నమస్కారము.

క్షమాదేవతా ! నీవు శాంతిని గల్గింతువు. నీకు వందనములు.

క్షమ యసమర్థులకు గుణముగాను సమర్థుల కలంకారముగాను నుండును. క్షమాకవచముఁ దొడిగినవానిని బ్రితివాదులు భంజింపలేరు. క్షమాయుధము ధరించినవానిని శత్రువు లేమియు సలుపలేరు.

క్షమామంత్రి మైంద్రిజాలికుని నెమిలికుంచెవలె శత్రుల మిత్రులఁజేయును.

## సీతారామావధూత

పడమటిలంకయందు సాధనాశ్రమములో నున్నసీతారామావధూతను వారిప్రియశిష్యుఁడైన శాంతానందుని గొంద అసూయాపరులు బాధించి వారియాశ్రమమును నిర్మూలింపఁబ్రయత్నించుచుండిరి. భక్తిపరు లగుకొందఱు గృహస్థు లీవిషయము రాజభటులకుం జెప్పి రప్పించి యాదుష్టుల బంధింపించి చెఱసాలకుఁ బంపుచుండ నాయవధూత వారికడ్డము వచ్చి 'తండ్రులారా ! రాజభటులచే మీరు కొందఱినే స్వాధీనముచేసికొనఁ గలరుకాని యందఱను గాదుగదా? ముల్లోకముల లోఁబఱచు కొనఁగలమంత్రము నాయొద్ద నున్నది. దానిం గ్రహింపుఁడన

వారు సంతసముతోఁ దెల్పుమనిరి. అవధూత 'శాంతమే యామహామంత్రము. శాంతముచే బ్రహ్మాండమంతయు జయింపవచ్చును' అని చెప్పి వారిని విడిపించెను. ఇప్పుడు బంధితులు మిత్రులైనారని చెప్పవలయునా ?

బాలుఁడా! పరు లపకారము నీకుఁ జేయ నీవు ప్రత్యపకారము చేయకుంటయు క్షమాచిహ్నము. ఇంద్రియోద్రేకము నడంచి కొనియుంటయు క్షమాచిహ్నము. నీకు బాధ కల్గుచున్నను బరుల సౌఖ్యమునకు భంగముకల్గింపకుంటయు క్షమాచిహ్నము.

కర్ణుఁడు

పరశురాముఁ డొకనాఁడు కర్ణునితొడపై శిరముంచి నిదురించి కొంతసేపటికి లేచిచూడఁగా రక్తము కన్పించెను. ఇది యేమని పరిశీలింపఁ గర్ణునితొడనుండి రక్తధారలు ప్రవహించుచుండెను. శిష్యుఁ డగుకర్ణునిఁ గారణ మేమని ప్రశ్నింప నతం 'డయ్యా ! తా మూరు భాగమున శీర్షముంచి నిదురించుచుండ నెద్దియో యొకపురుగు వచ్చి తొడను దొలుచుచుండె. దేవరవారికి నిద్రాభంగమగునని బాధనుసహించి కదలకయుంటి నని చెప్పెను. ఆహా ! ఎంతయోర్పు ? నాయనా! ఓర్పు నభ్యసింపుము.

ఐహికశాంతి యాత్మశాంతిని గల్గించును. ఆత్మశాంతి యాముష్మికశాంతినిఁ గల్గించును.

## ౬. దూరాలోచనము

బాలుఁడా! ప్రతికార్యమునకుఁ బట్టుదల యెట్లవసరమో దూరాలోచనముకూడ నట్లే యవసరము.

దూరాలోచనమన - నీకార్యమును జేసిన నేచేటుపాటులు వచ్చును? ఏమేలు కీళ్లు లభించును? అనియు, నెటువోయిన నెటువచ్చును? మిత్రశత్రువులు వ్యత్యస్తు లగుదురా? అనియు, పని నెఱవేఱునా? నెఱవేఱదా? ఎట్లుచేసిన నెఱవేఱు? ననియు-ముందుగా మనశ్శక్తిచే యోజించుట. ఇట్లాలోచించి యేకార్యమునైనఁ బ్రారంభించి పట్టుదలతోఁ జేసిన నది సిద్ధింపకెటువోవును?

ఓడనడుపువారి కనుకూల వాయువుతోడైనట్లు, ప్రవాహమునకు వర్షము సహాయపడినట్లు, పట్టుదలకు దీర్ఘదర్శిత్వమును దోడైన నిఁక నాకార్యము నెఱవేఱుటకు సందియమేమి? దీర్ఘదర్శిత్వము చెడుగును మార్చుకొనుటకును మంచిని గూర్చుకొనుటకును నత్యవసరము. రాఁగల కీడు నెఱుఁగమి వలనఁగదా మనము నేఁటియీదౌర్భాగ్యస్థితి నేడ్చుచు ననుభవించుచున్నారము.

దూరదృష్టివలననే కదా యౌగంధరాయణ మహామాత్యుఁడు తనయేలికయగు వత్సరాజునకుఁ బద్మావతిం గూర్చి సార్వభౌమత్వము సమకూరఁజేసినది? చాణక్యుఁడు రాక్షసతంత్ర

ములఁ గనుఁగొనఁగల్గి చంద్రగుప్తునకు సామ్రాజ్యమును సంధానించినది ? దూరదర్శి కానివాఁడు దుర్భరపరిహాసమునకు దోసిలి పట్టవలయును. దుస్తరాపత్సముద్రమునఁ దూలిపడ వలయును.

తొల్లి యొక యెఱుకు కొంచెమేని యెఱుక లేకగదా కొమ్మపైఁ గూరుచుండి మొదలు నఱకసాగెను ? అది సాంతము తెగినఁ దానును గొమ్మతోఁబాటు క్రిందఁబడుట నా యనాలోచనా పరుఁడెఱుఁగఁడు. మూఢునకు దూరదృష్టి యెక్కడిది? వాఁడే సుమా కాలాంతరమునఁ గాళీప్రసాదమువలనఁ గాళిదాసైనది!

బండిగుఱ్ఱమునకు వెనుకచూపులేదు. మందునకు ముందుచూపులేదు. వివేకవంతునకే సరియైన దూరదృష్టియుండును. వాని యూహము లభేద్యవ్యూహములు. అవి పరదుర్గములఁ బటాపంచలుచేయును. దుష్టులమర్మములఁ దునాతునకలుచేయును. భానుకిరణములు ప్రసరింపనిపట్టులు కలవు. గాలి దూరని నెలవులు కలవు. దూరదృష్టి తాకని తావులు లేవు.

నేత్రము పదార్థముల బాహ్యస్వరూపమునుమాత్రము పరికింపఁగలదు. ఆలోచన వాని యంతర్భాగమునే యరయఁగలదు. లోచనము రూపమును జూచును. ఆలోచన మరూపమును జూచును. అక్షి పుట్టిన వానిని జూచును. ఆలోచన పుట్టని వానిని జూచును. పరిమితదృష్టి లోచనమునకు-అపరిమితదృష్టి యాలోచనమునకు.

౪. అరిదివిలుకాని యుజ్జ్వల
శర మొక్కని నొంచుఁ దప్పిచనినం జను నే
ర్పరి యైనవానినీతి
స్ఫురణము పగరాజు నతనిభూమిం జెఱుచుకా.

విల్కాని చే విడువఁబడిన పదునైనబాణ మొక్కనిని జంపినఁ జంపును. లేక తొలఁగిపోయినఁ బోవును. నేర్పరియగు వాని యాలోచనము పగవాని నొకనినేగాక యతనిరాష్ట్రమును గూడఁ జెఱుచును.

ధర్మజుఁడు

ధర్మజుం డెంతదూరదర్శియో యెఱుఁగుదురా? దేవతలకైన నలవిగాని భీష్ముఁడు సర్వసేనానాయకుఁడైయున్నాఁడు. అవ్వల ద్రోణుఁ డున్నాఁడు. వీరిఁ దా నెట్లుజయింతునని యూహించెనో? పిదపఁ గర్ణుఁడే సేనాపతియగునని యెట్లుతలఁచెనో? వానికి సరియగుసారథి లేఁడు. వాఁడు శల్యుని సారథ్యమునకు నిల్పుకొనఁగలఁడని యెట్లుయోజించెనో? యుధిష్ఠిరుఁడు యుద్ధారంభమునకుఁ బూర్వమే శల్యునిఁబ్రార్థించి 'నీవు కర్ణసారథి వయ్యెదవు. అప్పు డర్జునుని గనిపెట్టియుండవలయు' నని యాచించెను. చూచితిరా పెద్దలబుద్ధులు? పెద్దలు జరుగునట్లు తలఁచెదరో తలఁచినట్లు జరుగునో మనము గ్రహింపలేము. పదునొకొండక్షౌహిణుల తనసేనలో దుర్యోధనుఁడు శల్యునే కర్ణసారథిగాఁ జేయఁగలఁడని యోచించుధర్మజుని బుద్ధిసూక్ష్మత నెవ్వరు కొండాడఁ గలరు?

వివేకవంతుల దూరాలోచన మనునయస్ాంతమిల్లే సత్యము నాకర్షించునది? వివేకము శాస్త్రజ్ఞత సౌశీల్యము సామర్థ్యము మంత్రమున కావశ్యకములు. తనకుఁ దెలియనపు డొరుల నాలోచన మడుగవచ్చుఁగాని యట్టివారు స్త్రీలు-జూదరులు-ననవహితహృదయులు-దుస్స్వభావులు- కాఁగూడదు. కార్యసిద్ధ్యనంతరముకాని మంత్రము బయల్పడరాదు. అనర్థప్రతీకారమ యాలోచనకు ముఖ్యఫలము.

## చేఁపలు

ఒకయేటిమడువునఁ గొన్ని చేఁపలు గలవు. అందు దీర్ఘదర్శి యను మత్స్యంబు 'వేసవి వచ్చినది. మడు వింకఁగలదు. మన మొండుచోటి కేగవలయు" నని పల్కి మిగిలినవి వినకున్నఁ దానే యొండుచోటి కరిగి సుఖముండె. ప్రాప్తకాలజ్ఞుఁ డను మత్స్యంబు 'అంతవచ్చినపు డుపాయము నప్పుడే వరికింపవచ్చు' నని పలికి జాలరులత్రాడు గఱచి చచ్చినట్లుండి యెట్టెటో తప్పించుకొనియె.

దీర్ఘసూత్రుఁ డనుమత్స్యంబు 'ఇప్పుడే యీచింతయేల? మడువు జడసిధివలె నున్నది. భయమేల?' అనిపలికి జాలరులచేఁ జిక్కి యుపాయమేదియుఁ దోఁచక మృతినొందె. కనుక ముందుగా నాలోచించి రాఁగల యనర్థమునకుఁ బ్రతీకారము నాచరింపవలయును. చిరక్రియుఁడు గావలయుఁగాని యసమీక్ష్యకారి కాఁగూడదు.

## చిరకారి

ఒకముని తనపత్నిపై నలిగి యామెను జంపఁ గుమారుం జిర కారిని బనిచి తా నెటకో పోయెను. చిరకారి దీర్ఘముగా నాలోచించి పనిచేయువాఁడు గాన నిట్లని తలపోయసాగె 'నమాతుః పరదైవత' మ్మని పెద్ద లందురు. నాకొఱ కెన్నియో యిడుమలుపడి గర్భమున నున్నదిమొదలు నన్ను రక్షించినది. తన సుఖముల నుజ్జగించి నాకై దుర్భరగర్భవేదనల ననుభవించినది. అట్టితల్లి నెట్లు చంపెదను. ఒకవేళ చంపనో? తండ్రియానతిని దాటినట్లగును. అదియు మహాపాపము. పితాజ్ఞాపరిపాలనము పరమధర్మమని రాముండు లాచరించిరి. అట్టితండ్రిపంపు సేయ కెట్లుండనోపుదు ? అక్కటా ! ఇప్పు డే నేమిచేయుదు? నని కొంతసేపు తల్లినిగూర్చి కొంతసేపు తండ్రినిగూర్చి తలపోయుచుండెను. ఇంతలో ముని తనకోప ముపశమింప 'నయ్యో ! స్వల్పదోషమునకే యాలిం జంపఁబనిచితి. నెంతతొందరపడితిని. ఇంతకు నాపని గడవంబడునోకో? ' యనుచు గడువడిగా నింటికి వచ్చి యాలోచించుచున్న కొడుకుం జూచి 'నీతల్లిని క్షమించితిని. నీవు త్వరపడి పనిచేయనందుకు ముదమయ్యె' నని యతనిం దీవించి మ్రొక్కిన పత్ని నాదరించి సుఖముండె. చిరకారి యాలోచనమే తల్లిని గాపాడినదని బాలుఁడా ! గ్రహించితివా ?

కం. కార్యవిచారము చిరముగ
స్థైర్యముతో నడపవలయుఁ దత్తత్క్రియలం
దార్యుఁ డనార్యుఁడు వీఁడని
యార్యులు సేయుదురు నిశ్చయమును జిరముగన్.

కం. మిత్రిత్వము శత్రుత్వముఁ
బాత్రతయు నపాత్రతయును బరికించు సుచా
రిత్రుఁడు చిరతరగణనా
సూత్రితముగ దాన నెల్లశుభములు నొందున్.

కంచె కవ్వాలనున్న గర్తముం జూడక కంచెదూఁకిన నాగర్తములోఁ బడకుండెదరే? అట్లే ముందు చూడక పనులు చేసిన నష్టి పొందెదరు. ఇందు సందియంబు నొందం బనిలేదు.

రెండుముత్యములు

ఒకఁడు మిక్కిలి పాటువడి రెండుముత్తియముల సంపాదించుకొని కార్యావసరమున దేశాంతరమేగుచు వానిని దనమిత్రుఁడైన రత్నగుప్తునికి దాచ నిచ్చి కతిపయదినంబులకుఁ దనపని నెఱవేర్చుకొని తిరిగి వచ్చి తనముత్యముల నిమ్మన నతండు 'ముత్యములెక్కడ ? నీవెక్కడ ? నీమొగం బెవ్వఁడెఱుంగు? ఏల యీబన్ను'లని ధిక్కరించెను.

అందువలన నతండు చేయునదిలేక వగచి న్యాయాధికారియగు రామన్న గారితో జరిగినవృత్తాంతముఁ జెప్పి వేఁడికొన నాయధిపతి రత్నగుప్తుని బిలిపించి యడుగ నతం డే నెఱుంగనని చెప్ప నతం డుభయులఁ బంపివై చెను.

పిదపఁ గొంతకాలమునకు రామన్న రత్నగుప్తుని బిలిపించి వాని చెప్పినమాదిరిగల ముత్తియములసరము నొండు వాని కిచ్చి దీనిదారము ప్రాఁతది. నూత్నసూత్రంబున నీమూఁటు ముత్యంబులఁ గూర్చికొనిరమ్ము. నీకంటె విశ్వసనీయుం డొరుండు లభింపమి నీకిచ్చితి నన నతం డుబ్బి వానిని లెక్కింప కయే యింటికిం గొంపోయి నవీనసూత్రంబునం గ్రుచ్చి పిదప లెక్కింపఁ దొంబదియెనిమిదియే యుండెను. దాని కతండు భీతచేతస్కుండై కడమరెండు నస్మత్ప్రమాదంబునం బోయి యుండవచ్చు. ఇప్పు డాన్యాయాధిపతికిం బోయినవని చెప్పిన సమ్మతించునే ? కట్టా ! యిక్కట్టు మూడినదని కొంతసేపు విలపించి యవ్వల ధైర్యము వహించి యేమైనంగానిమ్ము. లోపంబు గన్పింపకుండవలయునని పూర్వము మిత్రుం డొసంగిన రెండుముత్తియములతోఁ గలిపి యాసరంబు గట్టి కొంపోయి రామన్నగారి కొసంగ నతండు లెక్కించి యేమీ యీ రెండుముత్తెంబు లెక్కుడివని గద్దించి పలుక చేయునది లేక యపరాధంబు నొప్పికొని శిక్షితుండయ్యెను. కాఁబట్టి దూరదృష్టి వలయును.

## ౭. దినచర్య

బాలుఁడా ! వేగుఁబోకనే నిద్ర మేల్కొనుము. జడంబులగు పద్మంబులు కులాయంబులం బక్షి సంతానము నుషఃకాలం

బునఁ గదా మేల్కొనునది? ఆపాటివివేకమేని మానవుల కుండవలదే? సూర్యభగవానుఁ డేతెంచియా మనల మేల్కొలుపవలసినది? నాయనా! మెలఁకువ గలుగుటతోడనే సెజ్జపైనుండియే నీపవిత్రమ నవీనభావమును భగవంతున కర్పింపుము.

వాడని, వాడువాఱని ననఁ గదా సర్వేశ్వరుని పాద పద్మముల కర్పింపవలసినది. నిమీలితాక్షుండవై యుండియే యించుకసేపు నీయిష్టదైవమును స్మరింపుము. భగవద్ధ్యానపరమైన శ్లోకములఁగాని పద్యములఁగాని మఱేవేనినైనఁ బెద్దలయొద్దనభ్యసించి వానిని వేకువఁ బఠించుచుండుము. గడగడ చదివివేయుటకాక తదర్థమును భావించుచుఁ జదువు కొనవలయును జుమీ.

అవ్వలఁ గాల్యములం దీర్చికొనుము. సకాలంబున మల మూత్రవిసర్జన మొనర్పవలయును. అట్లొనర్పమివలననే మానవులకు దృష్టిమాంద్యము, బాధిర్యము మొదలగువ్యాధు లుదయించుచున్నవి. పక్షులకు దూరదృష్టి కలుగుట కిదియే కారణము. మలమూత్రనిరోధమువలన వ్యాధిబాధలు పెక్కువిధములఁ బొడముచుండును.

ఆరోగ్యపద్ధతుల ననుసరించి నీదేహమును బరిశుభ్రముగా నుంచికొనుము. కొందఱివదనగహ్వరమునుండి దుర్గంధవాయువులు వీచుచుండును. నీవు నీజిహ్వాను దంతాదులను నిత్యము

శుద్ధిచేసికొనుచుండుము. దంతచూర్ణము మొదలైనకృత్రిమౌషధముల వేడుకగా వాడి నీపలుకుదురును బాడుసేసికొనకుము. వెలుపలఁదిరిగి యింటికి వచ్చినపుడు కాలుసేతులఁ గడిగికొన మఱవకుము. ఇందువలనఁ గంటికిఁ గన్పడని యెన్నియో క్రిమ్లు తొలఁగిపోవుచుండును.

ప్రాతఃకాలమున నాదినమున నీవు చేయవలసినపనుల నొక్కమాఱు జ్ఞప్తికిఁ దెచ్చికొనుము. అట్లు లైన నవసరకార్యములు చెడిపోవు. ముందువెనుకల నెఱింగి పను లొనరించుచుండుము.

బాలుఁడా! ఆఁకలియగుచున్నపుడుగాని, అన్నముఁ దినినవెంటనేకాని, యలసియున్నపుడుకాని చదునకుము. ప్రాతఃవేళలఁ బాఠములఁ జదివికొనుము. ఏది చదివినను సార్థముగా మనసున నాటునట్లు చదువుకొనవలయును. మతి యొకచోట మాట యొకచోటనైన మంచి కల్గునా? మదిలేక లక్షపర్యాయములు పఠించినదానికంటె మదికల్గి యొక్కసారి పఠించినదే మిక్కిలి ప్రయోజనకారియని గుర్తించుము. పాఠక్రమసూచికననుసరించి చదివికొనవలయునని యింకను నుడువవలయునా? వెలికిలంబరుండిగాని మెడను మిక్కిలి క్రిందికి వంచిగాని చదువరాదు. పాత్రము కంటికి కడుగుదూరమున నుండవలయును. లేకున్నఁ జూపు తఱిగిపోవును. కాంతి పుస్తకమునఁ బడునట్లు దీపము నుంచికొనవలయును.

తెలియని విషయము నితరుల నడిగి తెలిసికొనుము. 'ఈస్వ
ల్పవిషయము నెఱుంగకున్న నచ్చుప్రమాద మేమి ?' యని
నిర్లక్ష్యముసేయకుము. ముఖ్యాముఖ్యముల నిర్ణయింప నీపరి
మితజ్ఞానమున కలవియగునే ? అన్నియవయవములు సరిగా
నున్ననే యందగాఁడగును. లోపము లోపమేకదా ?

పొత్తములఁ జక్కఁగా నుంచికొనుము. వానిపుటలనిండ గీఁ
తలు గీసి చెడఁగొట్టకుము. ఎప్పుడు చూచినను బుస్తకము
గ్రొత్తదానివలె నుండునట్లు పదిలముగా వాడుకొనుము. కాగి
తముఁ ద్రిప్పునపుడు నలుఁగునట్లుకాని చినుఁగునట్లుగాని లా
గకుము. పొత్తముల నెల్లెడలఁ జెల్లాచెదరుగాఁ బడవేసికొన
కుము. ఏరకమున కారకము చేర్చి పొత్తముల నుచితస్థలముల
నుంచుకొనుము. గ్రంథములపట్టికను సిద్ధము చేసికొనుటయు
మంచిదే.

ప్రతిదినము సూర్యోదయమునకుఁ బూర్వమ శీతలసలిల
స్నానము చేయుము. అందును 'ఉత్తమంతు నదీస్నాన' మ్మని
పెద్దలందురుగాన నదీస్నానమైన నారోగ్యకరము. అది లభింప
నిచోఁ గూపోదకమే శ్రేష్ఠము. అగస్త్యనక్షత్రముదయించిన
పిదపఁ దత్కిరణప్రసారంబుకలిమి నుదకంబు తేజోవంతంబగుట
నయ్యుదకము శరీరమునకు దీప్తికరం బగుటలో నేమివింత ?
కనుక నుషస్స్నాన ముత్తమము. గోడమీఁదఁబోసినట్లు దేహ

ముపై జలంబుపోయక (ఖద్దరు) వస్త్రముతో శరీరము సమ్మార్జనము సేయుచు స్నానము చేయవలయును. అట్లైన నంగమందలి మురికి పోయి రోమకూపముల కడ్డులేకయుండును. కనుకఁ బ్రత్యవయవమును గట్టిగాఁ దోముకొనుము. ప్రతిశనివారము నభ్యంగస్నాన మాచరింపుము. తైలలేపనంబున శరీరము నునుపెక్కును. మఱియు నెన్నియోలాభములు కలవు.

ఏకార్యము సలుపుచున్నను దదేకమనస్కుఁడవై యొనరించు చుండుము. అన్యమనస్కుఁడవు కాకుము. మనోబల మద్వితీయమైనది. శరీరబలమువలె దానిబలము దృగ్గోచరము కాదు.

అట్లు హృదయమును నియమించునధికారము నీవ యుంచికొనవలయును. అది నిన్ను నియమింపఁగూడదు. నీ వధికారివి. చిత్తము 'చిత్తము చిత్త'మనుచుండు సేవకుఁడు. అట్లైననే నీవు సౌఖ్యపడఁగలవు.

వేళ కన్నము దినుము. 'శతం విహాయ భోక్తవ్య' మ్మను పెద్దలనుడిని స్మరించి నూఱుపనులున్నను వదలిపెట్టి సకాలమున భుజింపుము. భోజనసమయమున 'నది లే, దిది లే; దది రుచిగా లే; దిం దుప్పులే, దందుఁగారము లే' దనుచుఁ జీదఱించుచుఁ గోపభావమున భుజింపకుము. అట్లైన నీ కాయన్నరస మంతయుఁ గోపభావమునే వృద్ధిపఱచునదియై నీయందొక దుర్గుణమును జిరస్థాయిగాఁ జేయునది యగును. కన్న

తల్లి నీకుఁ బెట్టక తాను దినఁగలదే? కనుక మారాము చేయకుము.

అన్నమునకు నమస్కరించి ' యిది యమృతస్వరూపము. ఇది నాకుఁ బుష్టిని దుష్టిని నాయురారోగ్యములఁ గల్గించుఁగావుత' మనితలంచి హరిస్మరణముచేయుచు నాదరంబున నన్నము నారగింపుము. కబళంబున నర్ధంబుఁగొఱికి మిగిలినదానిని బాత్రమున నుంచికొనకుము. అది దురభ్యాసము. అట్లుచేసిన నీ కసహ్యము లేదా? మెతుకులు క్రిందఁ బడఁగూడదు. అన్నపూర్ణాదేవి ననాదరింతురే?

నీ వొరులపాత్రునం గుడువకుము. నీయుచ్ఛిష్టము నొకరికిం బెట్టకుము. ఒరులది నీవు గ్రసింపకుము. అది పాపమనుట యెట్లున్నను నారోగ్యమునకుమాత్రము భంగకరము. అన్నము దినుచుఁ దినుచు లేచిపోవఁగూడదు. పోయిన మరల వచ్చి తద్భుక్తశేషము నే భుజింపఁ గూడదు. అన్యులు చూచుచుండ నారగింపకుము. ఆచారముపుట్టిన దారోగ్యమునకే. అపవిత్రత్వము బహువిధజ్ఞానావగమ్యము నగుట దేనికేని కారణము మాత్రము చెప్పక పాపమనిమాత్రము చెప్పివేసెదరు. కారణ మనుభవమువలన నీకే గోచరించును. విధినిషేధముల మాత్ర మిప్పుడు తెలిసికొని ప్రవర్తింపుము.

రుచ్యమైనపదార్థమునేని మితముగానే భుజింపవలయును. సాధ్యమైనంతవఱకు మితభాషివై భుజింపఁ జూడుము.

భాగుగా నమలి తినుము. రాజస తామస పదార్థముల భుజింపకుము.

శ్లో. ఆయు స్సత్త్వబలారోగ్య । సుఖప్రీతివివర్ధనాః

రస్యా స్స్నిగ్ధా స్థిరా హృద్యా । ఆహారా స్సాత్త్వికప్రియాః.

రసయుక్తములు ఘృతసమన్వితములు చిరకాలస్థాయులు ప్రియములు నైనవియును, ఆయువును జ్ఞానమును బలమును నారోగ్యమును సుఖమును సంతోషమును వృద్ధిపొందించునవియును నగుభోజనపదార్థముల సాత్త్వికులంగీకరింతురు.

శ్లో. కట్వమ్లలవణాత్యుష్ణ । తీక్ష్ణరూక్షవిదాహినః

ఆహారా రాజస స్యేష్టా । దుఃఖశోకామయప్రదాః.

బాధ, వగపు, రోగము, కలిగించునవియు, మిక్కిలిచేదు, మిక్కిలి పులుసు, మిక్కిలియుప్పును గలవియును, వేడిచేయునవియును, మిక్కిలికారము గలవియు, నాళ్ళుమొదలైన కఠినమైనవియు, నావాలుమొదలైన యతిదాహము కలిగించునవియు నగుపదార్థములు రజోగుణము గలవారికిఁ బ్రియములు.

శ్లో. యాతయామం గతరసం । పూతి పర్యుషితంచ యత్

ఉచ్ఛిష్టమపి చామేధ్యం । భోజనం తామసప్రియం.

వంటచేసినపిదప జాముకాలమై చల్లారినదియు, స్వభావసిద్ధమైనరసముపోయి కాలాంతరమున మఱొకరుచిని బొందినదియు

దుర్వాసన కలిగినదియు, చద్దియైనదియు, ఎంగిలియైనదియు, నపవిత్రమైనదియు నగుపదార్థములఁ దమోగుణవంతులు కోరుదురు.

కనుక నాయనా! నీవు సత్త్వగుణము నభివృద్ధిచేయుపదార్థముల నారగింపుము.

సమయము నతిక్రమింపక పాఠశాల కరుగుము. ఒజ్జయొద్ద నొద్దికమీఱ మెలంగి విద్య నేర్చికొనుము. గురువునోటినుండి యేపలుకువచ్చునోయని శ్రద్ధాభక్తులతో వినుచుండుము. తెలియని విషయముల వ్రాసికొనుచుండుము. ఏనాటిపాఠముల నానాఁడొప్పగించుచున్న నిన్నధ్యాపకుఁడు పుత్రప్రేమతోఁ జూచును. గురువు శిక్షించునది నీమేలునకే సుమీ. అంగనయు నశ్వంబును విద్యార్థియు సుశిక్షితులుగాక రాణింపరు.

నీవు వినయభక్తిశ్రద్ధలవలన గురువనుగ్రహంబు సంపాదింపుము. సముద్రుఁడు చెలియలి కట్టంబోలె నీవు నుపాధ్యాయు నాజ్ఞప్తి నుల్లంఘింపకుము. అగాధాజ్ఞానవారాంనిధినిమగ్నుఁడ వైనని న్నుద్ధరించుగురుని సేవలం దన్పవలదె?

శ్లో. మంత్రే, తీర్థే, ద్విజే, దైవే । దైవజ్ఞే, భేషజే, గురౌ,
యాదృశీ భావనా యత్ర । సిద్ధి ర్భవతి తాదృశీ.

శ్లో. గుశబ్ద స్త్వంధకారే స్యాత్ । రుశబ్ద స్తన్నిరోధకః
అంధకారనిరోధిత్వా । ద్గురు రిత్యభిధీయతే.

గుశబ్దమున కర్థ మజ్ఞానాంధకారము. రుశబ్దము దానిని నిరోధించునది. కనుక గురుపదమున కర్థ మజ్ఞానముఁ దొలఁచువాఁడని. అట్టివాని నెట్లుసేవింపవలయునో యోజింపుము. " గురుశుశ్రూషయా విద్యా" గురుని సేవించుటవలన విద్య లభించును. కనుక నేగదా భగవదవతారమూర్తు లగుబలరామకృష్ణులును సాందీపని గురూత్తముగా నంగీకరించి యడవులనుండి కుశసమిత్ఫలాదుల మోసి కొని తెచ్చి చదివికొనిరి? శంఖంబునం బోయునిది తీర్థముగాదన్నట్లు తా మెంతవారైనను గురుముఖమునుండి గ్రహింపవలసినదే.

అవక్రీతుఁడు

తొల్లి గురుకులవాసంబున బహుక్లేశంబుల సహించి విద్య నభ్యసించిన రైభ్యునితో నవక్రీతుండు మత్సరించి సర్వవిద్యల ననతికాలంబునం బడయఁ దపంబు సేయంబూనుకొనెను. అప్పు డిందు్రఁడు వృద్ధవిప్రరూపంబున వచ్చి సికతాముష్టిపరంపర నపారగంభీర గంగాప్రవాహంబునందు సేతుబంధనంబు సేయ నమకట్ట నవక్రీతుండు సూచి తాతా! యిదియేమిపని? యన నవ్వృద్ధపాఱుం డీనదికి సేతునిర్మాణంబు నాచరించుచుంటి నన నవక్రీతుండు సెలవివాఱ నవ్వి యిక్కార్యం బిట్టిన్నటికేని సాధ్యంబగునే? ఎంతపిచ్చివాఁడ వన నమ్ముదుసలి అబ్బాయీ! యెన్నటికేని యెవ్వరికేని చదువక విద్యవచ్చునే? నీపూన్కి

నెఱవేఱిన నాపూర్ణిక్తమాత్రి మేలగా దనిపరిహాసించెను. అట్లయినను వాఁడు పట్టువట్టి తపంబుసలిపి వరప్రదానంబున సర్వవిద్యలం బొందియు రైభ్యుని జయింపలేక యతనిచే నిర్జితుండై ప్రాణంబులఁ గోల్పోయెను.

కం. గురుశుశ్రూష యొనర్చుచుఁ
బరమక్లేశమునఁజేసి పడసినవిద్యల్
స్ఫురియించుఁగాక గురుముఖ
విరహితముగఁ బడసినవియు వెలయునె యెందుక్ ?

గురుసేవ సలిపి మిక్కిలికష్టపడి పొందినచదువులు రాణించుఁ గాని తదితరోపాయములఁ బడసినవిద్యలు ప్రకాశింపవు. చదువులలోనిమర్మము గురుఁడు నుడివినంగాని యెఱుకపడదు. అట్టిగురు నెన్నండేని దిరస్కరింపకుము. అది మహాపాపము. ఒకవేళ మాఱుపల్కితివో ! మరల నతనియనుగ్రహము సంపాదించుకొనుము.

కం. గురువునకు మాఱువల్కుటఁ
బొరసినకల్మషము వాసిపోవు నతనికిం
బరితోషముగా వినయపు
శిరవున నుపహార మిచ్చి వినతుండైనన్.

గురునకు బదులువలికినచోఁ బాపము సంభవించును. దానిం దొలంచుకొనఁ దలంచితివో వానికి సంతసము గల్గునట్లు వినయవినమితోత్తమాంగుండవై కానుక లొసంగి యనుగ్రహింప వేఁడికొనుము. అతఁడు సుప్రసన్నుఁడైన నీపాపము

పోవును. తోడిబాలురపైఁ గొండెములు సెప్పకుము. అది దురభ్యాసము.

గురువులంబోలెఁ దల్లిదండ్రిలను, జననీజనకులంబోలె నొజ్జలను, సేవింపుము - భావింపుము - పూజింపుము - పెద్దలకు నమస్కరించుట లగ్గుగాదె ?

ఆ. వె. వృద్ధు వచ్చునపుడు విను బాలుప్రాణంబు
లెగయఁజూచు నతని కెదురులేచి
ప్రణతిఁ జేసెనేనిఁ బాదుసఁబడి యవి
దొంటియట్ల నిలుచు దురితదూర!

పెద్దలు వచ్చునపుడు బాలురయసువులు వెడలఁబోవును. అప్పు డాపెద్దల కెదురేగి నమస్కరించినచో నవి మరల యథాస్థానమున నుండును. కనుక గురువువచ్చుటతోడనే లేచి నమస్కరింపుము.

గురుని నొరులు దూషించుచున్న విననే కూడదు. అట్టిచో నీవు గురుని దూషింపఁ గూడదనియుఁ జెప్పవలయునా ?

శ్లో. గురో ర్యత్ర పరీభావో నిందా వాపి ప్రవర్తతే,
కర్ణౌ తత్ర పిధాతవ్యౌ గంతవ్యం వా తతోఽన్యతః.

నీగురు నొరు లవమానించుచున్నను నిందించుచున్నను నీ వచ్చట నిలువకుము. లేదేని శ్రోత్రములు మూసికొని వినకుము- అనుచుం బెద్దలు నుడివిరయ్యా!

బాలుఁడా ! సాయంసమయమున నాడుకొనుము. అదియే నీకు వ్యాయామము. వ్యాయామమువలనఁ గష్టసహిష్ణుత - అవయవ పటుత్వము - జఠరాగ్నిదీపనము - మనోహరాకృతి- ఆరోగ్యంబును లభించుచు. శరీరంబున రక్తం బతివేగంబునం బ్రవహించుఁగాన రక్తశుద్ధియు -వృద్ధియుఁగలుగును. ధనికులు బడి కేగుటకేని నడువరు. అందువలన వారి కజీర్ణరోగములు మెండుగ వచ్చును.

### అజీర్ణరోగి

గర్తపురంబున నొకధనవంతుఁడు గలఁడు. అతఁడు ఫర్లాంగు దూరమైన నెన్నండు నడిచియెఱుఁగఁడు. తినుట కూర్చుండుట - ఇట్లు కాలముగడుపు నతని కజీర్తివ్యాధి లభించెను. ఎందఱువైద్యులనో యాశ్రయించెను. ఎంతధనమో వ్యయము చేసెను. కాని యాఁకలి కలుగలేదు. జీర్ణశక్తి యలవడలేదు. అంత నొక యారోగ్యశాఖాధికారితో వానికిఁ బరిచయము కలిగెను. అతఁడు వైద్యమునుగూడ నెఱింగియుండుటచే వాని వలనఁ దనరోగము పాయు నని విశ్వసించి వాని నాశ్రయించెను. ఒకనాఁ డిరువురు నొకబండిలోఁ బోవుచుండ నధికారి ప్రమాదంబునంబోలెఁ గొరడాను నేల జారవిడిచెను. క్రిందఁ బడినకొరడాను దాను దెచ్చినచో మర్యాదగానుండునని వినయంబుం గన్పఱచుటకో యన బండి దిగి కొరడాను గైకొని యా

యజీర్ణరోగి బండి నందుకొన నించుకవడిగా నడిచి పిదప నించుక పర్వెత్తసాగెను. ఆవైద్యాధికారి వృషభ మాగక పోవుచున్న దన్నట్లు నటించుచు వడివడిగా బండిని నడిపించుచుండెను. ఇట్లరమైలు పోయినపిదప వగర్తకున కలుపువచ్చుటయు శరీర మంతయు స్వేదబిందుపటలావృత మగుటయు నిట్టూర్పులు వడిగా వచ్చుటయు నావైద్యుఁడు గ్రహించి బండి యాపి వాని నెక్కించుకొనిపోయి యెల్లి రమ్ము నీకు దివ్యౌషధ మొం డిచ్చెదనని వానిఁ బంపివైచెను. అట్లు కొండొకవ్యాజంబున నరమైలు పర్వెత్తినందువలననే వాని కానాఁడించుక యాఁకలికలిగినట్లుండెను. మరునాఁడు వాఁడు రా మరల నిదేమం దనిచెప్పి వానిచే నట్లు చేయించి రోగము కుదిర్చెను.

కనుక నాయనా! నీవు ప్రతిదినము నెమ్మెను జెమ్మటఁ దొప్పఁదోఁగువఱకుఁ బరిశ్రమము చేయుము. ఆడుకొనుము. "అతి సర్వత్ర వర్జయేత్" అనినట్లు నిట్టూర్పులు మిక్కిలి వేగమున వెడల నారంభించుదు నిఁక నాపరిశ్రమము చేయుట నాఁపుము.

ఆటలలో నీతోడి చెలికాండ్రమనంబు నొప్పింపకుము. ధర్మబద్ధుఁడవైన నెవరి కేమి మనఃకష్టము కల్గదు.

చీఁకటినీలితెరలు మార్గావరోధము కల్గింపకయ మున్నమాత్రమిలు సేరుచుండుము.

కొందఱుబాలు రాడుకొనినఁ గాలహరణ మగుననియుఁ జదు వుకొనవలయుననియుఁ జెప్పి వసిగా గదికిఁ బోయి శుష్కపు సంగంబులఁ బొద్దుపుత్తురు. వీరియవివేకము నేమనవలయును? అట్లు చదువుకొనక ఆటలనెపంబున వ్యాయామము సలుపక రొంటికింజెడిన రేవడలైరి.

వ్యాయామానంతరము చెమ్మట లడఁగినపిమ్మట స్నానముచే యుము. మాపటివేళను జదివికొనవలయును.

బాలుఁడా! పగలంతయు నేవేనిపను లొనర్చుటవలన నింద్రియములన్నియు శ్రమమొంది తత్తద్విషయములనుండి మర లును. అదియే నిద్ర. నిద్ర ప్రతివాని కత్యంతావశ్యకము. ఏలయన పనిసేసినవారికి విశ్రాంతి యవసరముగాదా? కను కనే భగవంతుఁ డెల్లజీవులు విశ్రమింప రాత్రికాలము నేర్పఱ చెను. భగవన్నిర్ణయముప్రకారము రేలనే నిద్రింపవలయును గాని పగటిపూట నిద్రపోరాదు. పగటినిద్ర పనిచేటుకు ముద్ర. అనారోగ్యమున కాలవాలము. సోమరిపోతులకే యీపిశాచిపట్టును. వా రందునంబొడమిన యొడలిబడలికవలన నానాపాపాలు పడుచుందురు. పగట నిద్రాకేళి, రేల మేలు కోలు కూడదు. అన్నిటికివలెనే నిద్రకును మితి కలదు. "బుధః స్వాపం మితం చరేత్" అని కలదుగదా! కనుక నధికనిద్రయు నిద్రారాహిత్యమును గూడనివి.

క౦. బలవంతుఁడు పైనెత్తిన
బలహీనుఁడు ధనముఁ గోలుపడినయతఁడు మ్రు
చ్చిల వేచువాఁడు కాము
కులచిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా!

క౦. ఇక్కొ అగాములలోపల
నొక్కటి నీచిత్తవృత్తి నొందెనొ? యొరుసొ
మ్మొక్కటిఁ గుదువఁ దలంచితొ?
నిక్కము గత మేమి చెప్పుమ నిద్ర చెడుటకున్?

విదురుఁడు ధృతరాష్ట్రునితోఁ బల్కుచున్నాఁడు - రాజా! బలవంతుఁడు తనమీదికి దండెత్తివచ్చినపుడు దుర్బలునకును, ధనముఁ బోఁగొట్టుకొన్నవానికిని, దొంగిల నెదురు చూచువానికిని, విషయాసక్తునకును నిద్రపట్టదు.

ఈపనికిమాలినవానిలో నేదియైన నీకొదవెనా? లేక యన్యులసొమ్మొక్కఁడవే యనుభవింపఁ దలంచుచుంటివా? నిద్ర రాకునికికిఁ గతం బేమి? యనెను.

నాయనా! సుమా రెనిమిదిగంటలకాలము నిద్రింపుము. కొందఱెడమవైపున కొత్తిలి నిద్రింపవలయు నందురు. తూర్పునకుఁ గాని దక్షిణమునకుఁగాని తలయుంచి నిద్రింపవలయుఁ గాని పశ్చిమోత్తరపుఁ దలగడలు మాత్రము పనికిరా వందురు.

నీవు సెజ్జపైఁ జేరుటతోడనే యొక్కసారి యుదయమునుండి నీవు సలిపినపనులలో నేదేని యకృత్య మున్నదేమో విచా

రించి చూచుము. అట్లున్నచో నది భగవంతునకు నివేదించి యజ్ఞానమువలన నిట్లాచరించితి నిఁక నెప్పటికి నట్లు చేయ నని పశ్చాత్తప్తచిత్తుండ వగుము. భగవంతుని వేఁడుకొనుము. ఇట్లభ్యసించి నీతప్పు నీవే తెలిసికొనఁగలిగిన నీవు పాపము నుండి తొలఁగిపోఁగలవు. క్రమముగాఁ బుణ్యాత్ముఁడవు కాఁగలవు. నేను భగవంతునితో నిఁక నట్టియకార్యము నాచఁరింప నని పలికి మరల నట్లు యాచరించితివా? సర్వాంతర్యామిని నీవు వంచించినట్లే? భగవంతునితోడనా బద్దులాడఁ బొల్పునది? కూడదు. కూడదు.

“స్వామి! నన్ను సన్మార్గమునఁ బ్రవేశపెట్టుము-నీయనుగ్రహమునకుఁ బాత్రుని జేసికొనుము”- అని ప్రార్థించి సుఖముగా నిద్రించుము. గుండెపైఁ జేయి వైచికొని నిద్రింపకుము. ఆర్ద్రిపాదుండవై నిద్రపోకుము అగ్గము-పరిశుభ్రము నైనశయ్యపైఁ బరుండుము. రేల వృక్షములక్రిందఁ బరుండరాదు. ఒకరు విడిచినగాలి నొకరు పీల్వరాదు. శయనస్థలమునకుఁ బరిశుభ్రవాయువులు వచ్చుచుండవలయును. ఎవ్వరికేని నిద్రాభంగము సేయరాదు. పరాకున నున్నని న్నెవ్వఁడేని యాకస్మికముగనాకర్షించిన నెట్లో యట్లే యింద్రియములకును నని యెఱుంగుము.

### హయగ్రీవావతారము

పూర్వము విష్ణు వనేకవత్సరములు ఘోరరాక్షసులతోఁ బోరాడి సంహరించి యలసి యధిజ్యధన్వుండై యుండియే కన్ను

గవ మొగిడ్చెనఁట. అయ్యదనుననే దేవకార్యార్థము బ్రహ్మేంద్రాదు లయ్యెడ కరిగి నిద్రాభంగము సేయనోడిరఁట. ఒక్కరైనఁ దత్స్వాపభంగకల్మషమున కొడిగట్టమి సురజ్యేష్ఠుండరసి మిక్కిలి విచారించి చెదలును సృజించి తత్కార్యమున నియోగించె. అవియు వృజినభీతిసెంది గడగడవడంకుచు నిలువంబడ వానియింగితం బెఱింగి నలుమొగములచదురుఁడిట్లనియె. భయంబు వలదు. నేను దీనికి మీకుఁ బ్రత్యుపకారముగా హవ్యంబునం భాగమిచ్చెదను. హృషీకేశు మేల్కొల్పుఁడన నవి విబుధులతోడి పొత్తు లభించినదని హర్షించి యియ్యకొని మెల్లగాఁజని గదాధరు నెదుటంబడి పిలువ నలుకువడి గనయము దాపున నారిఁ దునిమెనఁట. తత్క్షణమే పట్టుఁదొలఁగిన యాబలిష్ఠమౌర్వీఘాతంబునఁ గేశవుమూర్ధంబు స్థానభ్రంశంబు నొందెనఁట. అవ్వేలఁ బరమేష్ఠి హయగ్రీవము సంధానించెనఁట. అదియే హయగ్రీవావతారము.

వర్ణాశ్రమభేదములవలన నధికారతారతమ్యములవలన దినచర్య యొకరికున్నట్లొకరి కుండక భిన్నభిన్నముగా నుండును. అది వారువారు నిర్ణయించుకొనవలయును. కనుక బాలుఁడా! నీవును నేయేసమయముల నేయేపనుల నాచరింపవలయునో నిర్ధరించుకొని యట్లాచరింప నభ్యసింపుము. సాధ్యమైనంతవఱకు నానిర్ణయము నుల్లంఘింపఁ జూడకుము. ఇది మిక్కిలి మంచి

పద్ధతి. పూర్వము మహాపురుషులని పేరందినవారందఱు నిట్లే యాచరించిరి. అట్లైనచో సోమరితనముగాని వృథాకాల యాపనముగాని సీదరిఁజేరదు. నడవడి కొకకట్టుబా టేర్ప డును. హృదయము విసువునొందదు. కార్యంబులును సకాలం బున సిద్ధినొందుచుండును.

మాదన్న మొదలగుమహామాత్యులును శ్రీరామదాసు మున్నగు భక్తవర్యులును కృష్ణరాయప్రభృతిమహారాజులును నిట్లే ప్రవర్తించిరి. చూడుఁడు కృష్ణదేవరాయలదినచర్య —

సీ. సౌఖశాయనికభిషక్పూర్వకము కాల్య
వేళఁ గార్తాంతికద్విజులగోష్ఠి;
జాముపోవ సమాత్యసామంతపూర్వకం
బగ్రాగ్రజన్మపుకాయస్థగోష్ఠి;
దినమధ్యమమున మర్దనమల్లపూర్వకం
బగుసూదనూపకృత్కృపగయుగోష్ఠి;
యపరాహ్ణమున దేవతార్చనాపూర్వకం
బార్యధర్మాధికృద్వ్యతులగోష్ఠి;
తే. గీ. భుక్తిమీఁద విదూషకపూర్వకము పు
రాణకవిగోష్ఠి; చారపూర్వకము సంజ
జాము గాయకగోష్ఠి; నిశకు సుషుప్తి
పూర్వకము పేరియసీగోష్ఠి పాసఁగుఁ బతికి.

"ఉదయకాలంబునందు సుఖశయనమా.యని యడుగువారును వైద్యులును మున్నుగాజ్యోతిశ్శాస్త్రవిదు లైనవిప్రులగోష్ఠి

యును, జాముప్రొద్దెక్కిన వెనుక మంత్రులు సామంతనృపులు మొదలుగా ద్రవ్యార్జనాధికారమునం దుండువారలతోడను గణకులతోడను సల్లాపమును, మధ్యాహ్నసమయమం దొడలుపట్టుజెట్టివాండ్రు లోనుగా వంటకమువండువారితోడను, బప్పుకూరలు వండువారితోడను, మాంసముఁదెచ్చియిచ్చు వేఁటకాండ్రతోడను సంభాషణమును, నపరాహ్ణమునందు దేవపూజ మొదలుగాఁ బూజ్యులతోడను, ధర్మాధికారులతోడను జ్ఞానోపదేశముసేయుమానులతోడను సముచితసంభాషణంబును, భోజనమొనర్చినపిదప విదూషకపూర్వకము పౌరాణికసుకవిగోష్ఠియును, సాయంకాలమందు వేగులవాండ్రతో భాషించి పిదప గాయకులతోఁ బ్రొద్దుపుచ్చుటయును, రాత్రియందు నిద్రించుటమున్నగాఁ బ్రియురాలితో సల్లాపములాడుటయును నృపతికిఁ దగును."

ఇట్లే కర్మరతులైనసద్బ్రాహ్మణులును, స్నానము, సంధ్యావందనము, జపము, హోమము, బ్రహ్మయజ్ఞము, దేవతార్చనము, వైశ్వదేవము, అతిథిపూజ యను నెనిమిదిభాగములఁ దమకర్మము విభజించుకొని నిత్యము నాచరింతురు. కనుక నీవును నీవిధుల నెఱింగి యట్లాచరింపుము.

నవమాధ్యాయము సమాప్తము.

ఓమ్.

# నీతి వాచకము

## దశమాధ్యాయము - నింద్యములు

### ౧ డంబము

బాలుఁడా ! మీలోఁ బలువురు డాబుతో నటింపఁజూతురు. తమదంభము నొరు లెఱుంగ రనియుఁ బాపము! వారు విశ్వసింతురు.

దంభము నా లేనిదానిని నున్నట్లు ప్రకటించుట. విద్యాశూన్యుఁడైనను విద్వాంసునివలెఁ గన్పట్టుఁ, బేదయయ్యు ధనికుని పగిదిఁ బరఁగఁ దెలియనివాఁడయ్యుఁ దెలిసినవానిచందమునఁ గుల్కు డంబ మందురు.

నిజమునకు డాబు దారిద్ర్యములో నున్నది. ఏది లేకున్నను లేమియే గదా! లేమిని గప్పికొనఁ జేయుప్రయత్నమే డంబము. ఇంటఁ గుచేలుఁడు. బయటఁ బీతాంబరుఁడు. లోన రోగి పైకి భోగి. ఇంట నీఁగలమ్రోఁత. బయటఁ బల్లకీలమ్రోఁత. మిక్కిలి దీర్ఘముగా విచారించిన లోకమంతయుఁ గలవానిని గౌరవించుటవలననే దంభ ముత్పన్న మగుచున్నదని తోఁచక మానదు.

మఱియు గౌరవమునకుఁ బూజ్యతకుఁ గీర్తికి నాసపడువారే దంభవేషముఁ దాల్పవలయును. తద్వాంఛ లేనివాఁడు దంభము దరిఁ జేరనీయఁడు. చూచుచుంటిమిగదా సన్యాసులను! విరాగులను! నిష్కాముసకు దంభపిశాచితోఁ బనియేమి? కొందఱు కులగౌరవము గాపాడుటకుఁ బెద్దలపేరు నిలుపుటకు నలుగురితో సమానులుగా నుండుటకు డంబపుఁగవచముఁ దగిలించుకొందురు.

ఐన నీదంభ మెక్కడసాగును ? తన్నెఱుంగనిచోట. భళిరే ! దంభమునకుఁ బరిచితులచోటు కులిశపుఁబోటు. దాని నవలంబించుట యేల ? స్వార్థపరత్వమున.

ఐనను నాలాభప్రాప్తి యేకపర్యాయ పర్యవసాయియే. వైశ్యుఁడు గోచిపాతలరాయఁడయ్యుఁ దాను లక్షాధికారివలె నటించి లక్షలతో వ్యాపారముచేయును.

పురోహితుఁడు "శుక్లాంబరధర" మ్మని రానివాఁడైనను నజ్ఞానులయింట షోడశకర్మలఁ జేయించుచు బియ్యపుమూటల నింటికిఁ జేరవేయును. పందయైనను రాజు మీసము మెలివేసి కన్నులెఱ్ఱఁజేసి పరుల లోఁబఱుచుకొనును. కాని యేదంభ మెఱుంగనివాఁడు కృషీవలుఁడే. వానికి డాబుతోఁ గావలసిన పని లేదు.

డాబునకును వివేకము తోడ్పడవలయును. అగ్గికిఁ దెమ్మెర చెలిమి వలయుంగదా!

దాంభికునకు సిగ్గుశెరం లుండవు. అసత్యమునకు వెఱవఁడు. వాఁడు మేడిపండును మెచ్చుకొనును. నేతిబీరకాయను బ్రీతి మీఁఱఁ జూచును.

దాంభికులుగూడఁ బరులచే వంచితు లగుచుందురు. వాతాహారత్వముచేఁ బాములు లోకులను వంచించును. అట్టిపాముల మయూరములు జలవ్రితత్వమున నమ్మించి చంపివేయును. అట్టిబస్వాలం జర్మవసనధారణమున నమ్మించి లుబ్ధకులు హింసింతురు.

దంభము కృత్రిమముగదా. దాని కెన్నటికేని ముప్పురాక యెట్లుతప్పును? చూడు విరాటనందనుఁడు త్తరుఁ డంతిపురి దంభోక్తులుపలికి కయ్యమునకేగి కడ కేమిచేసెను? పులితోలు గప్పికొన్న గాడిదకథ నెఱుఁగవా?

గార్దభము

ఒకమడివేలున కొకగార్దభము కలదు. వాఁడు దానిఁ బొట్ట నిండ మేపఁదలంచి వ్యాఘ్రచర్మం బొడలికిఁ బొదిగి పరులచేల రేలఁ దోలువాఁడు. అది కుక్షినిండ భక్షించి గృహంబు సేరెడిది. చేనివాఁ డ ద్దానిని శార్దూలంబకాఁ దలంచి పాఱిపోయెడివాఁడు. ఒకనాఁడు దైవయోగంబున మఱొక ఖరంబు గన్పట్టుడు నాద్వీపిచర్మావృతరాసభంబు సహజస్వభావం బగుట నోండ్రపెట్టెను. చేరువఁ బొంచియున్న కాపువాఁ డది

కృత్రిమబాలేయంబని బడియతోఁబాది ప్రాణంబులం గొనియె. దంభ మొక్కొక్కప్పుడు ప్రాణాపాయమును గల్గించును.

బాలుఁడా! నీవు దంభముం గాలఁదన్నుము. తెలియనివిషయమును దెలిసినట్లు నటింపకుము. తెలియకపోవుట తప్పుకాదు. తెలిసినట్లు నటించుట తప్పు.

నీకుఁ బాఠము తెలియనప్పు డడిగి మరలఁ దెలిసికొమ్ము. అట్లయిననే నీవు పరీక్షయందు త్తీర్ణుఁడ వగుదువు. ఉండి లేదని జరుపవచ్చుంగాని, లేక యున్నదని జరుపుట కష్టమే కాక యపాయకరమును. ఇక్కట్టుల కిక్కయగు నీచక్కిని దొక్కకుము. తాత్కాలికలాభ మేస్వల్పమో యందువలన లభించినను నది స్థిరమైనది కాదు. దంభముతో నీవెన్ని దినములు లోకమున జీవింపఁగలవు? ఒకఁడు సంగీతసభలో నూరక తలఁద్రిప్పసాగును. ఎందుకు? తన్నొరులు వీఁడు స్వారస్యము గ్రహించె నని తలంచుటకు. ఒకఁడు నామములం బెట్టుకొని హరినామస్మరణ సేయుచుండును. తన్నొరులు భక్తుఁడను కొనుటకు. ఒకఁడు పరులపద్యములఁ దనపేరుతోఁ బ్రకటించుకొనును. తన్నందఱుఁ గవిఁగా నెంచుటకు. ఇట్టివెన్నియో కలవు. ఏల యీనడత? కూడదు. కూడదు. దంభవృత్తి కూడదు. నీ వొకటవతరగతిఁ జదువుచు నెనిమిదవతరగతిని జదువుచుంటి నని చెప్పికొన్న లాభమేమి? నీకుఁ బరీక్షలో గుణ

ములు ముప్పదిరా డెబ్బదియని చెప్పుకొన్నలాభ మేమి? విన్న వారు నిన్ను సన్నుతించుటకా ? నీకాయానంద మెంతకాల ముండును? కనుక నాయనా! దాంభిక వేషము వేయకుము. దంభోక్తులు వలుకకుము. దంభక్రియ లాచరింపకుము.

## ౨ హింస

బాలుఁడా ! హింసయనఁగాఁ బరులఁ జంపుటయు బాధించుటయుఁగూడ నగును. దీనిని గొందఱు వేడుకగా సల్పుదురు. కొందఱు స్వకార్యంబుల సిద్ధింబొందించుట కొనర్తురు కొందఱు గత్యంతరము లేక యాచరింతురు. ఎట్లుసేసినను హింసయే. హింసాత్ముల మానసంబులు క్రోధకలుషితంబులు. వీక్షణంబులు దారుణభయంకరంబులు. వాక్కులు కర్ణకఠోర పరుషాశని సన్నిభంబులు.

వారు స్వపరభేదంబులం జూడక యావేశపూరితాంతఃకరణులై హింసాకర్మంబున కొడిగట్టుదురు. శార్దూలి నిజశాబకంబులనే కఱుకునఁ గొఱికివేసెడిని. క్రూరవ్యాళి స్వాండంబులనే మిత్రివాతఁ ద్రోసెడిని. కుక్కురంబులకు మార్జారంబులే మపకృతి యొనరించినవి ?

హింస మానసిక వాచిక కాయిక భేదంబులం ద్రివిధంబు. అన్యులఁ బీడింపవలయుననియు, బెడఁద దొడరఁజేయవలయుననియుఁ బిల్కుమార్పవలయుననియుఁ దలపోయుట మానసిక

హింస. పరులఁ బరుష వ్యాహారంబులఁ బరిభవించుటయు, నిందా వచన సందోహంబులం గుందించుటయు, దబ్బరలవలనఁ ద బ్బిబ్బుసేయుటయు వాచికహింస. ఒరులఁ బిడికిళ్ళం బొడుచుట, హస్తతలంబుల మోదుట, పాదంబులఁ దాఁచుట నఖంబులం జీరుట, రదనంబుల దళించుట, మున్నగునవి కాయికహింసలు. నాయనా ! యీత్రివిధహింసలకు దూరుండవైన నహింస నవ లంబించినవాఁడ వగుదువు. స్వప్రయోజనపరాయణత నన్య భూతంబుల నధర్మంబున నడంచునీహింసాపథంబు నీకేల ?

క, భూతముల కలుగునతనికి
భూతము లఖిలమును నలుగు; భూతహితార్థీ !
భూతముల కభయ మిచ్చిన
పూతాత్మున కభయమిచ్చు భూతావలియుఁ.

భూతములకు ద్రోహము దలఁచువానిపై నఖిల భూతములును నలుగును. భూతముల కభయమిచ్చిన పుణ్యాత్మున కఖిలభూత ములు నభయమిచ్చును. నీ వొరులఁ జంపనుంకించుచున్నపుడు నిన్నుమాత్ర మొరులు చంప నేలయుంకింపరు ? నీ వొరుల కేదితలంతువో యొరులును నీకదియే తలంచుట నైజము కదా ? హింసాస్వభావున కెయ్యదియే నొప్పుమియుప్పతిల్లిన నప్పు డొకఁడేని తోడ్పడఁ బూనఁడుసరిగదా యెప్పుడా యొప్పుమి పీనిం దుంచుకొనిపోవునో యని లోకం బెదురుసూచు చుండును.

కంసునిమృతి కెవ్వండేని గుందునే? పూతనాసిధనంబున కెవ్వం
డేని గంటఁ దడివెట్టునే?

మారణకృత్య మాసురధర్మమని వాని నందఱు నిందిపంక
పోరు. నాయనా! హింసాహింసలస్వరూప మతిసూక్ష్మమైనది.
దాని నెఱుంగ శాస్త్రదృష్టి వలయును. కల్మషబుద్ధుల కది
యందదు. ఏలయందువా? మలినదర్పణంబు ప్రతిబింబంబు గ్రి
హింప సమర్థంబగునే? కనుక డెందంబు నిర్మాల్యంబునం బొందు
పఱుచుకొని యాలింపుము.

కొన్నిహింస లహింసలుగాను, నహింసలు హింసలుగాను
స్థూలదృష్టికి గోచరించుచుండును. కానియాథార్థ్యంబున నట్లు
గాదు. బాలుఁడా! ప్రమాదంబుం బొందక జాగరూకుండవై
తెలివిమై నేర్పున గ్రహింపవలయును.

అశ్వమేధాదియజ్ఞములందుఁ బ్రవర్తిల్లుహింసను శాస్త్ర మ
హింస యనుచున్నది.

మనము నిత్యము దీపికల వెల్గింతుముగదా. అం దెన్నిటకీ
ములు వచ్చిపడి మృతినొందుటలేదు. అది హింసయా?
కాదుః నేల దున్నునపుడు సీరాగ్రంబు సోకి యెన్ని ప్రాణులు
తనువు దొఱంగవు? అది కృషీవలునకు హింసాదోషము
నాపాదించునా? ఆపాదింపదు. గృహదాహకులు పరస్వాప
హర్తలు గరదులు పరవనితాపరాధులు మొదలగుదుర్జన

సందోహమును రాజుకఠినముగా శిక్షించును. ఇది హింసయా? మీఁదుమిక్కిలి యాదుర్జనుల శిక్షింప నుపేక్షించెనేని య న్నరనాథునకు హింసాదోషము సంభవించును. పంచభూతము లయం దక్షి కగోచరం బగుసూక్ష్మజీవ సముదయము లెన్ని లేవు ? నరుండు వాని నుపయోగించుకొనునపు డాభూత ములు మృతిసెందిన నది హింసయగునా? అట్లైన సకలకర్మల యందును హింసయే తొడరును. ఇఁక దేహయాత్రయే దుర్ఘ టముగదా? మానవుఁడు ధరాతలంబున సంచరించునపు డం దలిసూక్ష్మజీవు లెన్ని పాదంబులఁ ద్రొక్కఁబడి మ్రిందు చున్నవోగదా ? అది హింసయా ? నరవల్లభుండు ప్రజాపీడా కరంబు లగుఘాతుకమృగంబుల వేటాడి సంహరించును. అది హింసయా ? కాదు. ఇట్టులే పూర్వము ధర్మవ్యాధుఁడు నుడివెను.

## ధర్మవ్యాధుఁడు

పూర్వము కౌశికుం డనుబ్రాహ్మణుండు సంతతాధ్యయనతత్ప రుం డొకవృక్షమూలంబున నాసీనుండై వేదంబులు గుణియిం చుచుండఁ దదీయశాఖాగతం బైనయొక్కకొక్కెర యతనిపై రెట్టవైచిన నమ్మహాద్విజుం డలిగిచూచుటయు నది యప్పుడ నిశ్చేతనంబై నేలంబడినం గనుంగొని యతండు పెక్కుభంగులఁ గడుంగుంది మధ్యాహ్నం బగుటయుఁ గృతాహ్నికవిధానుండై

భిక్షాచరణంబుసేయుచు నొకపుణ్యగృహంబు వాకిట నిల్చి భిక్షాం దేహి యనుటయు నాయింటిపుణ్యసతి యతిసంభ్రమంబున భిక్షయిడుటకుఁ బాత్రశోధనంబు సేయునెడ భర్త వచ్చెను. వచ్చినవాథుని సేవలం దన్పి భిక్ష గైకొని రాఁ గౌశికుం డేల యింతయాలసించితివి? వెంటనే కడపినఁ బోనే యనుచుఁ గన్నులెఱ్ఱసేయు డత్తన్వి నమస్కరించి యయ్యా! నా పతికంటె నన్యులు నాకెక్కుడుగాదు. వారిసేవల సల్పుచుంటచే నాలస్యమైనది క్షమింపుము. మీకోపంబున నొక్కకొక్కెరయు నిహతంబయ్యెఁగదా ? ఏనెంతదాన నను డప్పారుండు విస్మితుండై నీ వెట్లు గ్రహించితమ్మా యనుడు నమ్మగువ నేను బతిభక్తికల్మి నెఱిఁగితి. ఇంక నీతో మాటలు పెక్కేల? నీవు కేవల స్వాధ్యాయపరుండవుగాని ధర్మసూక్ష్మత నెఱుఁగవు. మిథిలకు ధర్మవ్యాధునొద్ద కరుగు మతండు సర్వంబు వాకొచ్చెడు నన నతం డమ్మగువను దీవించి మిథిల కరిగి యతనిని సందర్శించి యిది యేమి యిట్టిహింసాకర్మంబున కొడిగట్టి మాంసవిక్రయం బొనరించుచుంటి వన ధర్మవ్యాధుఁ డిట్లనియె. అయ్యా! మీకుఁ దపస్స్వాధ్యాయ బ్రహ్మచర్యంబు లెట్లో యట్లే మా యెఱుకుకులంబునకును మాంసోపజీవనంబు పరమ ధర్మంబు. విశేషించి యిది వంశక్రమాగతం బైనయాచారంబు. అదియునుంగాక యొరులు చంపి తెచ్చిన మాంసము నే

విక్రియింతును. కులాచార మెవ్వరే నతిక్రమింతురే ? అట్లతి క్రమించిననే పాపముసుమా! ధర్మరహస్యం బెఱుఁగుట దుర్ల భంబు.

సీ. అనఘ! యాశీనరుం డగుశిబి నిజగాత్ర
హింస నిందాగ్నుల కిడఁడెమాంస?
మతనికి లేదయ్యె నయ్య! యుత్తమగతి?
రంతిదేవుం డనురాజు దొల్లి
యనుదినంబును గోసహస్రద్వయంబుగా
వధియింపఁడే వేయివత్సరములు
దురిత మమ్మహిాత్ముఁ దొడరెనే? వేదార్థ
నిరతులై యత్యంతనియతు లైన

తే. ధారణీసురముఖ్యు లధ్వరములందుఁ
బశువు వధియింపరే? తగఁ బరమపుణ్య
గతులు గలుగవె వారికిఁ? గడఁగి యగ్ను
లధికమాంసార్థు లని శ్రుతులందు వినమె?

ఉశీనరునిసుతుం డగుశిబిచక్రవర్తి తనశరీరముం గోసి యామ్మాంస మిందాగ్నులకుం బెట్టెఁగదా? అతనికి నుత్తమగతి లేదా? రంతిదేవుం డనురాజు దినంబునకు రెండువేలయావుల చొప్పున వేయివత్సరంబులు యజ్ఞార్థము వధించెను. అతనికిఁ బాపము లభించెనా? విశుద్ధాంతఃకరణు లగువిప్రులును యజ్ఞంబులఁ బశువు వధింతురు? వారికిఁ బుణ్యగతులు లేవా? అగ్నులును మాంసము నర్థించు నని శ్రుతులు వల్కుచున్నవి గదా. అవి పవిత్రములు గావో?

క. పనివడి యహింస వ్రతముగఁ
గొని వనమున నున్నమునులకుం దొడరదె హిం
సనము? తరుమూలఫలకా
కనిపీడన మదియు హింస గాదొకొ? తలఁపకా.

అహింసావ్రతము నవలంబించి వనమున నున్నమునులుంగూడ కందమూలముల ఫలములఁ గోసి తినియెదరు. అట్లు కోయుటయు హింసగాదా?

తే. హింస సేయనివాఁడు లేఁ డీజగమున
నొక్కఁడైనను దమదమ యోపినట్లు
హింస తెరువున కడగల్గి యేగవలయు
నదియ చూవె యహింస నా నతిశయిల్లు.

పైని వ్రాసినట్లు చూచుకొన్న నీజగంబున హింస సేయనివాఁ డొక్కండేని లేఁడన్నట్లు స్థూలదృష్టికి గోచరించుచుండును. కాని యది హింస కాదు. ఎల్లవారు తమకు సాధ్యమైనంత వఱకు హింస సేయక తొలంగి చనవలయును. అదియే యహింస. దానియంతట నది జరుగుచో దానికి మనము కర్తలము కాము. బుద్ధిపూర్వకంబుగ జంతువులంబట్టి వధింపకున్నఁ జాలు.

అని మఱియుం బెక్కుధర్మంబు లుపన్యసించి నీవు జననీజనకులఁ బూజింపక యిట్లు చరించినఁ బుణ్యంబు లేదని పలికి పుచ్చె. కనుక శాస్త్రవిహితంబులు హింసలుగాఁ గన్పించినను నవి యహింసలే సుమా!

బాలుఁడా! నీకొకటి సెప్పెద వినుము. నీబుద్ధిపూర్వకంబుగా దృగ్గోచరంబగు నేప్రాణినేని చంపకుము. చంపుటకుం బ్రోత్సాహింపకుము. ప్రోత్సహించినను హింసించిన వచ్చు కల్మషంబ వచ్చును.

ఈవిషయమై నాస్తికులతో వృథావాదంబు సలుపకుము. అట్లైన నిశ్చయజ్ఞానం బొకవేళ నీకుఁగల్గకున్నఁ జెడిపోయెదవు. విశ్వమంతయు హింసామయముగా గోచరించును. నాయనా! సర్వభూతముల నాత్మకు సమముగాఁ జింతించి ప్రేమించిన హింసాదూరుఁడ వయ్యెదవు. హింస సేయకున్న నహింస నవలంబించినట్లే.

అహింస సర్వోత్తమ మైనధర్మము. కావుననే "అహింసా పరమో ధర్మః" అని పెద్ద లనిరి. అనఁగా నహింసయే యుత్తమమైన ధర్మమని యర్థము.

ఆ. దంతియడుగులోనఁ దక్కిన జంతుచ
యంబునడుగు లెల్ల నడఁగియుండు
నట్లు ధర్మకోటులన్నియు లోనగు
నిద్ధగుణ యహింస కింత నిజము.

తక్కిన జంతువులయడుగులన్నియు నేనుఁగునడుగులో నిమిడిపోవునవే. అట్లే ధర్మములన్నియు నహింసలో నంతర్భూతమై యుండును.

ఒక్కయహింస నాచరించిన నన్నిధర్మముల నాచరించినట్లే సుమీ!

ఆ. దానమును దపంబు ధర్మంబు యజ్ఞంబు
శౌచ మంత్ర తంత్ర సత్యములును
బుధు లహింసరూపములుగాఁగఁ జెప్పుట
నెల్ల కల్మిసు మ్మహింసకలిమి.

దానాదులన్నియు నహింసారూపములే. అనఁగా నహింసవలనఁ గాని యవి యేర్పడవు. కనుక నహింస నవలంబించిన నామెల్ల ధర్మముల నవలంబించినట్లే నయ్యా! హింసను నీవెందుకుఁ జేయువలయు? మాంసమునకా? అక్కటకటా! అన్యమాంస మున నిజాంగమాంసమును బోషింపనా నీవ్రుతలంచు నది? ఇది యెంతస్వార్థపరత్వమో యించుక యోజింపుము.

మెడ కురియోయనఁ ద్రాడుగట్టి వధ్యస్థానమునకు బలాత్కృతి నాకర్షించుచు దీనదీనదృష్టుల నరయుచు వెనుకకాళ్ళపూని కతో నీడిగిలంబడుచు గద్గదస్వరంబున బా ... బా ... యని యఱచు మేకపోతుం గన్న నిగుండె యేల నీరుగాదురా? కటికవాఁడా!

అయ్యయో కొమ్ముల కుచ్చువోసి యీడ్చుకొనివచ్చి మొఱ నాలకించువా రొక్కరేని లేరే? యని కంట నీరు గాఱఁ బెద్ద పెట్టున వాపోవు దిక్కులేనిగొఱ్ఱెను వ్రేలాడఁదీసి బ్రదికి యుండఁగనే చర్మమొలుచుటకుఁ బూనునీకు బిడ్డలు లేరా? కటికవాఁడా!

అరరే! నీపాలము దున్నుటకుఁ గోడుకుల నిచ్చి నీబిడ్డలపొట్టల నింపుటకుఁ బాలిచ్చి నీయండఁజేరి నిన్నాశ్రయించుకొని యున్న చూలియావు నేమని కసాయివాని కమ్మెదవురా? పాపిష్ఠకృతఘ్నుఁడా!

ఓ కసాయివాఁడా! "మేము మాంసము దినువారము కనుక హింసించినఁ బాపము లేదందువా? మాంసముఁ దినకున్న నేమిరా? నీప్రాణములు సురుఁగు నటరా? నీకండలు కరుగు నటరా? నీయాయువు తఱుఁగునటరా!

పాపము లేదందువా? ఏలరా? శాస్త్రములు చెప్పుచు న్నవా? లేక నీబుద్ధి చెప్పుచున్నదా? ఏలలేదురా? అది నీ వంటిది గాదా? ఛీఛీ? నోరుమూయుము.

అని బాలుఁడా! నీవు హింసను మాన్పుము. నాయనా! పరుల మేలుచూచిననే తనకు మేలు కలుగును. పరులకుఁ గీడు దలఁ చినఁ దనకుఁ గీడు గలుగును. కనుక నహింస నవలంబించి పుణ్యాత్ముఁడ వగుము.

హింస సేయకుము. ప్రాణుల హింసింపకున్నను నీవు నిత్యజీవి తము నడపుట కవకాశ మున్నపుడు పాపపుహింస కేల పాల్పడవలయును?

నాయనా! మనపెద్ద లెంతభద్రముగాఁ బ్రవర్తించెదరో యెఱుఁగుదువా? పంచసూనంబులఁ బాపముదొడర వీలున్న

దని తత్పరిహారార్థము పంచయజ్ఞముల నాచరించెదరు. కనుకఁ గన్నులఁ జూచుచుఁ జూచుచు నేల హింసకుఁ బూనవలయును?

చౌర్యము.

బాలుఁడా! చౌర్య మంత్యత నింద్య మైన కార్యము. ఆత్మగౌరవము మొదలంటఁ బెఱికివైచును. యశోవినాశనము నాచరించును.

ప్రారంభముననే దానిఁ బాఱఁదోలవలయును. అవ్వల నెవ్వరు నడంపలేరు. మొక్కయై వంగనిది మ్రానై వంగునా? దొంగతనము సాధారణముగా లేమివలన నుదయమగును. పిదప నాసవలనఁ బెంపొందును. అవ్వల నభ్యాసమువలన నిత్యకృత్యమై విజృంభించును. ఇఁక దానిఁ బరిత్యజింప బ్రహ్మాదులు దిగిరావలయును.

వాల్మీకి

తొల్లి యొక యెఱుకు కూటికి గుడ్డకుఁ గఱవై కుటుంబపోషణ మొనర్చుకొనలేక స్తేయమునకుఁ బాల్పడెను. ఆగతానాగతుల ధనంబుదోఁచుకొని యతం డదియ వృత్తిగా జీవింప సాగెను. ఇట్లుండ నొకనాఁడు వానిపూర్వసుకృతవిశేషంబున నారదుం డామార్గంబున వచ్చుచుండ వీఁడెదురేగి నీవీణనచ్చటఁ బెట్టి కదలుము. లేకున్న బడియతోఁ దల బ్రద్దలుచేసెద నని యెను. అంత నమ్మునియ ట్లేపెట్టెదను; కాని కొండొకనాతో

మాటలాడుము. నీచేఁ జిక్కిన నే నెచ్చటికి కేఁగఁగలను? అయ్యా! యిదియేమి? చౌర్యము పాతకము గదా? యనిన నట్లైన నాయాలుబిడ్డల నెట్లు భరింపవలయు? నని యావ్యాధుం డన నన్నారదమహర్షి నవ్వి ఓయీ! అట్లైన నీపాపంబుంగూడ నీకళత్రము పంచికొనునేమో యడిగిరమ్ము. నే నిచ్చటనే యుండెదను. ఈయరణ్యంబున నిన్నుమొఱంగి యే నెక్కడి కేఁగఁగల నన నాచోరుం డమ్మహాత్ము సందర్శన సౌభాగ్యంబువలనన సంజనితయోచనాపరుండై యింటికరిగి ప్రియసి నడుగ నది యిట్లనియె. నీధనము నాకుఁగావలయుఁగానినీయఘ మేరికిఁగావలయును? కొఱవితోఁ దలగోఁకికొనుకూళను నేఁగా నన నమ్మాగండు విచారించి లాభము వచ్చినఁ గైకొని నష్టి వచ్చినఁ గైకొననినీతో నిఁక నాకేల? నీకై యే నేల పాపాచరణంబునకుఁ బాదము చాఁపవలయును? అని వెంటనే వైరాగ్యంబువహించి నారదమహర్షి పాదంబుల వ్రాలి మహాతపశ్చరణంబున వాల్మీకి మహామునీంద్రుఁడయ్యెను. కనుక బాలుఁడా! మనము తస్కరవృత్తికి దండము పెట్టవలయును. పాపము మనము ఫలము నొరులు ననుభవించుట కకార్యకరణము సలుపుట మందబుద్ధికాదా? ఒకవేళ మనకే ఫలముగూడ నను కొన్నను దాని నంటరాదు.

### శంఖుఁడు–లిఖితుఁడు

బాహుదానదీతీరమ్మున శంఖలిఖితు లిర్వురన్నదమ్ము లాశ్రమము నేర్పఱుచుకొని తపంబు సలుపుచుండిరి. శంఖునాశ్రమమ్ము

వివిధఫల విరాజిత భూరుహావితాన శోభితము. ఒకనాఁ డన్న లేకుండఁ దమ్ముఁడు లిఖితుం డందేగి పరిపక్వఫలంబులం గోసి కొని యారగించెను. పిదప శంఖుఁడు వచ్చి చూచి తమ్ముఁడా! యీఫలము లెక్కడివన నున్నరూపు సెప్పెను. అప్పు డగ్రజుండు నాయనా! అనుమతిలేక కోసి చౌరికకలుషము సంపాదించితివి. ముచ్చిమి యేరికేని పొసంగునే? ఏత త్పాపము నిప్పుడ పాచికొనుము. రాజసన్నిధి కేగి దం డము వేడికొనుము. అట్లైన ననఘుండ వయ్యెద వన నతండు రాజగు సుద్యుమ్ను పాలి కరిగి ముందుగాఁ జేయుదు ననిపించుకొని పిదపఁ దనకార్యంబు నుడివి శిక్షింపుమనియె. రా జొడంబడకున్న నతని నెట్లో యొడంబఱిచి కరయుగ చ్ఛేదనశిక్షం బొంది మహానందమున నన్న పాలికి వచ్చి సుశిక్షి తుఁడ నైతిననులిఖితు నన్న యాలింగనముచేసికొని యన్నా! నీవలన నస్మత్కుటుంబు వెలసె. నిష్కల్మషుండ వైతివి. ఇఁక నన్నదిఁ గృతస్నానుండవై సురమునిపితృతర్పణము లాచరింపు మన నతండేగి యాశైవలిని మునింగి లేచిన నప్పటియట్ల యతనిబాహువులు ప్రకాశించుచుండెను. పాపము వోయిన బాహువు లేలరావు? నాటినుండి సుమీ యానది బాహు దానామంబునఁ గ్రాలసాగెను.

బాలుఁడా! స్తేయమునకుఁ గరచరణఖండనశిక్ష. దానం జేసి యది యెంతయకార్యమో విచారింపుము.

పరులంగొట్టి బలాత్కరించి తీసికొన్నను బరు లెఱుంగకుండఁ గైకొన్నను దొంగతనమే.

దారిదోపిళ్ళు - కన్నపుదొంగతనములు - బందిపోటులు - నిక్లెన్నియో తెగలు గలవు. ఈకార్యమునకును నైపుణ్యము తెలివితేటలు నావశ్యకములు; లేనియెడలఁ బట్టువడును. వి స్తరించి నీకేలకాని, నీవు మాత్రము పరులసొమ్ము గ్రహింపకుము. తోడిబాలుర పుస్తకాదుల సంగ్రహింపకుము-" నేను రహస్యముగాఁ జేయుచుంటిని. నన్నెవ్వరు చూచుచుండలేదు. నేను పట్టువడ" ననితలంపకుము." దినము రాత్రులు ఋతువులు మనుజుసేయు సుకృతమును దుష్కృతంబును జూచుచుండు. ఒఱు లెఱుంగరు నన్నన్నయునికి తగదు. చదివియుంటివిగదా? ఈపద్యమును—

చ. విమలయశోనిధీ! పురుషవృత్త మెఱుంగుచునుండుఁ జూవె వే
దములును బంచభూతములు ధర్మవు సంధ్యలు నంతరాత్మయుఁ
యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా
ర్థము లివి యుండఁగా నరుఁడు దక్కన నేర్చునె తన్ను మ్రుచ్చిలన్?

కనుక దీని భావించుచుండు మని నీవు చౌర్యమునకుఁ జేతులు సాఁప లేవు.

కొందఱు బాలు రపహరించి తెచ్చినవస్తువును దల్లిదండ్రులు గ్రహించి చీవాట్లుపెట్టుటకుబదు "ఎంత నేర్పు గలవాఁడవు?

పరులకంట నెట్లుదుమ్ముగొట్టితివిరా నాయనా !" అనిపరిహసింపఁ జూనుదురు. ఇదియే బాలునిఁ జెడఁగొట్టుటకు మార్గము. తనబాలునికిఁ గలబుద్ధిచాతుర్యముల సత్కార్యాచరణకుం గడంగఁ బ్రవేశపెట్టరాదా? అప్పుడు సూచి మురియ రాదా?

బాలుఁడా! ఒక్కసారి దొంగిలించితివా? ఇఁక నిన్నెవ్వరు విశ్వసింపరు. నిన్నిలుచొరనీయరు. నీకు మర్యాదసేయరు. నిన్న లక్ష్యముగాఁ దిలకింతురు. నీమాటను బాటింపరు. నిన్ను గేలిసేయుదురు. చౌర్యమువలన హింస, హింసవలనఁ బాపమును, బాపమువలన నరకమును లభించును. తస్కరుం డందఱకు భీతిసెందుచుండును. అనవరతము నాత్మతోఁ గలహించుచుండును. వానికి సౌఖ్య ముండునో యుండదో !

దశమాధ్యాయము సమాప్తము.

# నీతిపద్యములు

తే. గీ. అనఘ ! యాచార మాయువుఁ బెనుచు; నదియ
కాదు శ్రీయును గీర్తియుం గలుగఁజేయు
విను దురాచారుఁ డాయువుపెనుపుఁ బొందఁ
డతని సర్వభూతంబులు నభిభవించు. 1

అర్థ. పెనుపు=పెంపు-అభివృద్ధి; అభిభవించుక=తిరస్కరించును.

కం. కావున నాచారపరత
భూవర ! మేల్, సాధుజనులు వోవు తెరువు సం
భావించుట యాచారము
దా వర్ణాశ్రమసమర్థాతం బరఁగు నృపా! 2

అర్థ. తాక=ఆయాచారము; వర్ణ + ఆశ్రమ సమ్ + అర్థాతక=
వర్ణములు-బ్రాహ్మణులు రాజులు వైశ్యులు శూద్రులు నాలుగు వర్ణములు
మఱియుం గలవు. ఆశ్రమములు - బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వాన
ప్రస్థము, సన్న్యాసము నాలుగాశ్రమములు, వీనికిఁ దగినది యాచారము.

ఆ. గురునిమాట సరకుగొనమి, దుశ్శీలత
పిట్ట, పుడుక, గోరు, పిసుకఁ ద్రుంపఁ
గఱవ, మరుగు; టుదయకాలాస్తమయసమ
యముల భానుఁ జూచు టాయు వడఁచు. 3

అర్థ. సరకుగొనమి = లెక్కపెట్టకుండుట; పిట్టనుబిసికి చంపుట;
పుల్లల నూరక తుంచివైచుచుండుట, గోళ్ళనెల్లప్పుడుఁగొఱుకుచుండుట ;

మరుగుట = అలవాటుపడుట; ఉదయకాల + అస్తమయసమయముల = ప్రొద్దుపొడిచినపుడు నస్తమించినపుడు.

కం. విను క్రోధంబును హింసయు
నన్ృతంబును లేమి; సంధ్యలైనం దదుపా
సనము; సురపూజనము రే
పొనరించుట; చిరతరాయు వొనరించు నృపా ! 4

అర్థ. అనృతము=బొంకు; లేమి=క్రోధహింసానృతములు లేకుండుట; సంధ్యలు + ఐనన్=సందెవేళలయినపుడు; రేపు=ప్రొద్దుటిపూట.

కం. దేవగృహముకడ, వీథిని,
గోవాటమునందు రచ్చకొట్టముపొంతన్
భూవర ! సస్యములను వి
ణ్మూత్రవిసృజన మొప్పదండ్రు చారిత్రవిదుల్. 5

గోవాటము=ఆవులుండుచెలవు; విణ్మూత్రవిసృజనము=మలమువిడుచుట.

ఆ. ప్రాఙ్ముఖుండు నార్ద్రపాదుండునై భోజ
నంబు సేఁత మే లనంగ విందు;
నిలిచియుండికుడుపు నింద్య; మమ్మెయి మూత్ర
సర్జనంబుఁ బాపసరణి యండ్రు. 6

అర్థ. ప్రాక్ + ముఖుఁడు = తూర్పువైపు మొగముంచినవాఁడు; ఆర్ద్రపాదుఁడు = పాదములఁగడిగికొన్నవాఁడు; ఆర్ద్ర = తడిసిన; చేఁత = చేయుట; కుడుపు = అన్నముతినుట.

కం. అనలము గోవును బ్రాహ్మణుఁ
జన దెంగిలితోడ ముట్టఁ; జంద్రార్కులఁ జూ

డను నమ్మాయిఁ దగ; దాసన
మును గాంస్యము ననఘ ! భిన్నములు వర్జ్యంబుల్. 7

అర్థ. అమ్మాయిక = అరీతి ( భుజించుచున్నపుడు ) ఆసనము = కూర్చుండుపీట; కాంస్యము=కంచు- తాగిగిడిచెంబు; భిన్నములు=పగిలినవి.

తే. అధ్యయనమున మస్తకం బంటుటయును
నిద్రయును నశుచితతోడ నింద్యకోటి
శిరముఁ గోకంగఁ దగ దిరుసేత, మస్త
కంబు తైలంబుఁ బూయఁగాఁ గాదు మేన. 8

అర్థ. మస్తకము=తల; ఇరుసేతక = రెండుచేతులతో; మస్తకంబు తైలంబుక=తలయందలి నూనెను.

తే. అంగహీను దరిద్రు విద్యావిహీను
రూపహీనునిఁ దెగడుట పాపమండ్రు ;
వేదదేవతానిందలు ; వేతనార్థ
కముగ జోస్యంబునడపుట కల్మషములు. 9

అర్థ. తెగడుట=నిందించుట ;

తే. నీళ్ళ నాడకమును పూఁత నిందితంబు ;
చీర తడితోవిదిర్చుట చెట్ట ; యొరులు
గట్టి విడిచినవస్త్రంబు గట్టఁగాదు ;
మడతమార్చు టొప్పదు కడుమాపుడైన. 10

అర్థ. పూఁత=మంచిగందము మొదలైనవాని నొడలికిఁబూసికొనుట; చెట్ట = కీడు.

కం. వలవదు వటపిప్పలముల
ఫలములు నమలంగ మేడిపండ్లును దగ; దా
వుల మేఁకల నెమిళుల యెఱ
చులుఁగానివి యవిహితంపుఁ జోటుల నధిపా ! 11

అర్థ. వట = మఱ్ఱి, పిప్పలము=రావిచెట్టు, ఎఱచులు = మాంసములు కానివి=పనికిరానివి; అవిహితంపుఁ జోటులన్=విహితముగానిచోటుల.

కం. విను మొరుచూచిన మూచూ
చిన భోజ్యము నింద్య ; మన్యచిత్తముతోడం
గొనఁ దగ దాహారము; పొ
త్తునఁ గుడుచుట యఘము గూడు దూషించుటయున్. 12

అర్థ. మూచూచిన=ఇతరులు వాసనచూచిన; భోజ్యము=ఆహారము;

కం. చేతఁగొని యుప్పు నములుట,
రాతిపయిని నుప్పుగొనుట రాత్రి దధిమధూ
పేతంబుగఁ గుడుచుట ధ
ర్మేతరములు ; రేయి సక్తు వెగ్గు నరేంద్రా ! 13

అర్థ. దధి=పెరుగు మధు + ఉపేతంబు = తేనెతోఁగూడుకొన్నది. ధర్మ + ఇతరములు=అధర్మములు. (అనారోగ్యములనుట) సక్తువు = పేల పిండి. ఎగ్గు=కీడు.

కం. ఒకళులు సూచినయది వా
రికిఁ బెట్టక నములుటయును ; బ్రీతిం దనపం
క్తికిఁ దెచ్చినచుట్టలు వే
ఱొకభంగిం గుడువఁ గుడుపు నుఱు విమభుక్తిన్. 14

అర్థ. చుట్టలు=చుట్టాలు; కుడుపు=తాను వేఱొకభంగిఁదినుట ; విష
భుక్తిన్=విషముతినుటతో; ఊఱున్=తగును. విషతుల్యమనుట.

కం. నేయి మధువు సక్తువు దధి
పాయసము జలంబు భుక్తపరిశిష్టము భూ
నాయక ! యేరికి నిడఁ దగ ;
దాయువు పెంపారఁగోరు టాత్మఁ గలిగినన్. 15

అర్థ. భుక్తపరిశిష్టమున్=తినఁగా మిగిలినదానిని.

ఆ. వె. భగిని, గురుని, మిత్త్రుఁ, బాడితు, వంశజుఁ
బేదవడినఁ దెచ్చి ప్రియముతోడఁ
దనగృహమున కల్మి కనురూపముగఁ బ్రోపు,
పెనుపుసేయు నాయువునకు సిరికి. 16

అర్థ. భగిని=తోడఁబుట్టినది; ప్రోపు=పోషించుట.

తే. గ్రువ్వ గ్రద్ద దివ్వార్పుఁబ్రువ్వ గూబ
యిల్లుసొచ్చిన శాంతి సేయింపవలయుఁ ;
జదువుఁ గుడుపును సందెలఁ జనదు ; రాత్రి
యైనఁ బితృకార్యములు సేయు టఘముఁ జేయు. 17

అర్థ. దివ్వార్పుఁబుర్వు=దీపమునార్పునట్టియొక పురుగు.

కం. కులమును రూపము శీలముఁ
గలకన్య వరించి యందుఁగనిన యపత్యం
బులకుఁ దగ నడుపునది మం
గళములు కృతదైవపైతృకక్రియుఁ డగుచున్. 18

అర్థ. అపత్యము=సంతానము.

తే. వలయుఁ బ్రాఙ్ముఖోదఙ్ముఖత్వముల నొకటి
తారకంబులుఁ దిథులును, వారములును
జోస్యు లెఱిఁగించినవి మేలు సువ్రతైక
లోల! మంగలిపనికిని దైలమునకు. 19

అర్థ. ప్రాక్ + ముఖ + ఉదక్ + ముఖత్వములు=తూర్పుముఖము-ఉత్తరపుమొగము; తారకంబులు=నక్షత్రములు; తైలము=చమురంటుకొనుట (అభ్యంగనము)

కం. తల్లికిఁ దండ్రికి సుతులకు
నెల్లవిధంబులను వలయు హితములు సెప్పన్
మల్లకుఁడుగాక కర్జము
సల్లభ్యము గాఁగఁజూచి సౌజన్యనిధీ! 20

అర్థ. మల్లకుఁడు=కఠినుఁడు; కర్జము=కార్యము

కం. జనకుం డధికుఁ డుపాధ్యా
యునకుఁ బదిమడుంగు లెక్క డుర్వీనాథా!
జనకునకు దశగుణంబులు
జనని గురుత్వమున నిది ప్రశస్తము శ్రుతులన్. 21

అర్థ. దశగుణంబులు=పదిరెట్లు

కం. జననీజనక గురులయెడ
నొనరించిన మేలుఁ గీడు నొదవించు సుఖం
బునకును దుఃఖమునకు నిం
తని కొలఁది యిడన్ వశంబె యజునకునైనన్ ? 22

అర్థ. కొలఁది=మితి; అజుఁడు=బ్రహ్మ

కం. మాతృపితృగురులు దక్కఁగ
నే తెరువునఁ బాప మొలసెనేనియు దానిం
బాతురు ప్రాయశ్చిత్త
స్థితులు, తద్విషయమైనఁ జెడ దల్పముల౯. 23

అర్థ. పాతురు=తొలఁగింతురు.

కం. కొలు చపహరించునన్నరుఁ
డెలుకయుఁ బందియును నైనయీదుర్జననం
బులఁ బొందు, నంతఁ బాపము
వొలియక యాతనికిఁ గుక్ష్ఠిపుట్టువుఁ గల్గు౯. 24

అర్థ. కొలుచు=ధాన్యము.

కం. ధనవాంఛ నిరాయుధుఁ జం
పిన గాడిదమొదలుగాఁగఁ బెక్కులు తిర్య
గ్జననంబులఁ బొందును, శ
స్త్రనిహతిఁ దోడ్తోడ మరణదశ వాటిల్లు౯. 25

అర్థ. నిర్ + ఆయుధు౯=ఆయుధములేనివానిని; తోడ్తోడ౯=వెంట
వెంటనే.

ఆ. ఆఁడుదానిఁ జంపినతఁ డేకవింశతి
దూష్యనరకవాసదుఃఖ మొందు;
నన్నదధిపయోఘృతాపూపహరణముల్
మక్షికాది కీటమయతఁ జేర్చు. 26

అర్థ. ఏకవింశతి ... దుఃఖము = ఇర్వదియొక్క చెడునరకముల నివసించుటవలని దుఃఖము; అన్న ... పారణముల్ = అన్నము, పెరుగు, పాలు, నెయ్యి, పిండివంటలు వీనిదొంగతనము; మక్షిక=ఈఁగ.

ఆ. ఫలము వినుము వెండిఁ బసిఁడి ముచ్చిలికొన్నఁ
గ్రోతి వాయసంబు గువ్వ నీచ
కృమియు నగు ; సదంబరము హరించిన శశ
జనన మొందు నరుఁడు మనుజనాథ ! 27

అర్థ. ముచ్చిలికొన్నక=దొంగిలించికొనినచో. సత్=అంబరము= మంచివస్త్రము. శశము=కుందేలు.

తే. నమ్మి యిల్లడవెట్టినసొమ్ము గొనిన
మీనులోనగు నీచపుయోనులందుఁ
బుట్టు ; గంధవస్తువులు గొన్నట్టివాఁడు
వినుము మఱుపుట్టువునఁ జుంచుతనము నొందు. 28

అర్థ. ఇల్లడ + పెట్టిన=దాచుకొనిన ; మీను=చేఁప.

కం. విను దానంబులఁ బాపము
లనఘా ! చెడు; దానములకు నన్నిటికిని స
జ్జనసేవ్య ! యన్నదానము
మును లధికంబండ్రు పాపములఁ బాపు నెడన్. 29

కం. న్యాయార్జిత మగునన్నము
వేయింటికిఁ బెట్టవలయు విప్రజనము హ
ర్షాయత్తంబుగ; దానం
బాయని పాపములు గలవె పౌరవముఖ్యా ! 30

అర్థ. న్యాయ + అర్జితము=న్యాయమువలన సంపాదింపఁబడినది.

తే. తిరిసియేనియు నన్నంబుదెచ్చి శిష్టు
లైనవిప్రులయాఁకలి నపహరించు
పురుషుఁ డూర్ధ్వలోకంబుల పురుషవరుల
కర్చనీయుఁడై వెలుఁగుచు నంద యుండు. 31

అర్థ. తిరిసియేనియున్=తిరిపమెత్తియైనను; ఊర్ధ్వలోకంబులన్ = పైలోకములందు; అర్చనీయుఁడు=పూజింపఁదగినవాఁడు.

తే. దివము వంధ్యంబుగాకుండఁ దివిరి యన్న
పానదానంబు లొదవినభంగిఁ జేసి
మఱిభుజించుటఁ బోలెదు మహితధర్మ
కార్య మొండొకఁ డెందును గలదె యరయ? 32

అర్థ. దివము=పగలు; వంధ్యము=వ్యర్థము; భుజించుటన్-పోలెడు= తినుటతో సమానమగునట్టి;

చ. తమతమకర్మముల్ దెరువు
దప్పక చేసినవారు దేవలో
కమున సుఖంబు వొందుదురు,
క్రిమ్మఱి వచ్చియుఁ బూర్వజాతి జ
న్మమున మహార్థిఁ బొందుదురు
మానిని,యిమ్మెయిఁదప్పి యొట్టికృ
త్యములఁ జరించి రజ్జనుల
కట్టికులంబునఁ బుట్టు వారిలున్. 33

కం. విను మలుకయుఁ గూర్మియు లే
వనవద్యా! యెజ్జనంబులందును విధికిన్;
మును చేసినకర్మముఫల
మనుభవగోచరముసేయు నంతియ తటితోన్. 34

అర్థ. విధికిన్=బ్రహ్మకు; కర్మము ఫలము = కర్మయొక్కఫలము; తటి=సమయము.

ఆ. ధనము గలిగియుండి ధవళాక్షి! కుడువక
కట్టు కుండుపరమకష్టజనము
ఒరువు లొత్తిచెప్ప నుపకారులై తొలు
పుట్టునందు మనినయట్టివారు. 35

అర్థ. ఒరువులు=ఇతరులు, ఒత్తిచెప్పన్ = నొక్కిచెప్పగా.

ఆ. తమకు ధనములేక తగుభోగముల కెవ్వ
రైన నడప మను సుఖార్థ్యజనులు
దొల్లి పేదవార లుల్లమర్థుల కెప్డుఁ
బెట్టఁ గోరుచుండి నట్టివారు. 36

అర్థ. ఉల్లము = మనస్సు. అర్థులు=యాచకులు.

తే. కలిగియుండియుఁ దెవుళులకతన భోగ
ములు భుజింపఁగలేని మర్త్యులు గిరీంద్ర
తనయ! తొలుమేన రోగముల్ దనికి చచ్చు
నపుడు దానంబుసేసినయట్టివారు. 37

అర్థ. తెవుళులకతనన్=రోగములవలన; గిరీంద్రతనయ= ఓపార్వతి
తనికి=కలిగి.

తే. అధికసౌందర్యములు గలయట్టిజనులు
దొల్లి మాంసభోజనములు దొఱఁగి యున్న
వారు; రూపవిహీనులు దారు రూపు
గలిగి తోలుమేనఁ గొనటులఁ బలికినారు. 38

అర్థ. తారు=తాము, కొనటులన్=అంగహీనులను; పలికినారు = గేలిసేసినారు.

సీ. ఆయాసపడకుండ నర్థంబుసేరెడు
వారు పాత్రజనంబుఁ దార పిలిచి
తోలుమేనఁ బెట్టిన యలఘుదయాఢ్యులు;
ధనసిద్ధి బహులయత్నమునఁ గలుగు
మనుజులు పూర్వజన్మమున నర్థులు దమ్ము
నడుగ దాఁపక యిచ్చినట్టివార;
లాయాసమునను విత్తాగమం బెడలెడు
జనులు ముందటిపుట్టువునఁ గృపావి
తే. హీనులై యాచకుల నలయించి పిదప
నిడనిలోభులు; ముదిసి ధనేశుఁ డగున
రుండు ప్రాయంబునాఁడీక గండడంగి
తొంటిభవమున నీగికిఁ బోడఁగినతఁడు. 39

అర్థ. తార=తామే, విత్త + అగమంబు + ఎడలెడుజనులు = డబ్బు రాకపోయెడిజనులు.

సీ. మేధావియై విన్కి మిగిలి విద్యలఁ బొల్చు
నరుఁడు ప్రాల్బ్యమున గురున కధిక
భక్తుఁడై తనదైనపాండిత్య మొరులకుఁ
గావించు వేడుక గలుగుసుజనుఁ;
డభ్యసింపంగ విద్యాయుక్తి లేకుండు
నాతండు దొల్లి విద్యాధికత్వ
మున గర్వియై శిష్టజనులకు సభ భంగ
మొనరించి కుందఁ జేసినయతండు;

తే. భార్యయును బిడ్డలును దాను బహుధనముల
భోగులై రోగములు లేక పొల్చువార
లమలినాచారపాత్రదానములు సత్య
కరుణలును బొంటిభవమునఁ గలిగినారు. 40

అర్థ. మేధావి = సూక్ష్మబుద్ధిగలవాఁడు; విన్కిన్ = వినుటచే; తొల్బ్యమునన్ = పూర్వజన్మమున; అమలిన + ఆచార = స్వచ్ఛమైన యాచారము; పాత్రదానములు = అర్హులకుదానము సేయుటలు.

ఆ. అలుబిడ్డ లొజటులై లేమిఁ గుందుచుఁ
దెవులు చేతఁ బడుచు నవయుజనులు
మున్ను క్రోధలోభముల నాస్తికతఁ బర
పీడనంబు సేసి పేర్చినారు. 41

అర్థ. ఒజటులు = చెడ్డస్వభావముగలవారు. తెవులు = రోగము.

క. విను మొకకుం చెఁడుధాన్యము
దన కాయతి గల్గినతఁడు దాని నొసఁగినన్;

ధనకోటిగల్గువాఁ డ
ద్ధన మొసఁగిన నొక్కరూప తత్తత్ఫలముల్. 42

అర్థ. ఆయతి = రాఁబడి.

క. పరుషత్వములే కంతః
కరణంబున శుద్ధి సొలఁగలిగి ప్రియము పొం
పిరివోవఁ జేఁత దానము
పరమోత్కృష్టంబు పద్మపత్త్రనిభాక్షీ! 43

అర్థ. పొంపిరివోవఁగ = అతిశయిల్లఁగా; చేఁత = చేయుట.

చ. తెవులుగొన్నవారి కవి
దీఁయుట కౌషధమీఁగి, దుర్గతుల్
దవులుజనాళిఁ బ్రోవు, సుప
థంబుగఁ దైర్థికకోటినన్పు, బాం
ధవరహితత్వదీనశవ
దాహము దుఃఖితులైనవారిఁ దే
ర్చ వెరవు నోర్పుఁ గల్మియును,
బ్రస్తుతికెక్కిన మేటిధర్మముల్. 44

అర్థ. ఈఁగి=ఇచ్చుట; తైర్థికకోటి = తీర్థయాత్రిసల్పువారిగుంపు; అన్పు=పంపుట.

తే. జాములును దివసములు మాసములు నేండ్లు
నెనకాల మాయువుఁ గొని యరుగుచుండు;

నెల్లిసేయుపనులు నేఁడ యింతి! మాపు
నర్చుపని రేప చేయుట నామతంబు. 45

అర్థ. ఎల్లి = రేపు. నేడు + అ = ఈదినముననే. రేపు = ప్రాతఃకాలము. మాపు=సాయంకాలము లేక రాత్రి.

కం. అనఘ! యధర్మము ధర్మం
బనుమతిఁ బుట్టించుఁ; దృణసమావృతమై ప్ర
స్ననితలముచందమునఁ దోఁ
చిన నూయింబోలె సూక్ష్మచిత్తత లేమిన్. 46

అర్థ. తృణసమావృతము=గడ్డిచేఁ గప్పఁబడినదై; ప్రస్ననితలము = అందమైననేల; నూయింబోలెన్ = బావివలె.

కం. మొలవం బెట్టనియట్టిది
మొలచునె? తొలుమేని దానముల నానార్థం
బులు సిద్ధించుఁ బ్రయత్నం
బులు లేకయు; నింతనిజము భూపవరేణ్యా! 47

తే. అలఘుతపములు దొలుమేనఁ గలిగెనేని
వెదకికొనివచ్చు నన్నరు విపులభోగ
ములు; పురాకృతవృద్ధసేవల ఫలించు
బుద్ధికలిమియు విద్యలఁ బొలుచుటయును. 48

అర్థ. అలఘు=గొప్ప; పురాకృత=పూర్వముచేయఁబడిన;

కం. తొలుమేన నహింసారుచి
గలిగిన దీర్ఘాయు వొందుఁ; గారణభూతం

బులు భూవర! యివి; యీగుణ
ములు లేమియు కీడులకును మూలం బరయన్. 49

ఈగుణములు=50 వ పద్యమందలివి.

తే. వినుము దానంబుఁ దపమును వృద్ధసేవ
నము నహింసయు నియతకృత్యములు సర్వ
జనుల; కిమ్మహాగుణములు మనమునందు
దృఢముగా నిల్పి నడపుము ధీరవర్య! 50

తే. ఒప్పుకున్నను నాత్మకులోక్తకర్మ
మూర్ధ్వగతిఁ జేర్చుఁ బరకర్మ మొప్పెనేని
నార్యజనములు గిల్బిషమండ్రు దానిఁ
గాన నడపుము నిజవంశకర్మ మధిప! 51

అర్థ. ఆత్మకుల + ఉక్తకర్మము=తనకులమునకుఁజెప్పఁబడినకర్మము.

చ. మనుజులు సేయునెవ్వరు? స
మస్తము నీశ్వరునాజ్ఞఁ జెల్లెడున్
వినుము కుఠారపాణి ధర
ణీరుహముల్ నఱకంగఁ బాపమొం
దునో కుఠారమున్? జనులు
దోసముఁబొందరు; కర్మ యీశ్వరుం
డనియెడి నిశ్చయంబు దృఢ
మై మది నిల్చినఁ జాలు భూవరా! 52

అర్థ. కుఠారపాణి = గండ్రగొడ్డలిచేతియందుఁగలవాఁడు. ధరణీ
రుహముల్=చెట్లు.

తే. అతిథిపితృదేవతాపూజ లాచరించి
కాని గృహమేధులకు భోజ్యమైనఁ గుడువఁ
దగదు; యజ్ఞశిష్టం బమృతంబుగాఁగ
నార్యజనములు సెప్పుదు రధిపవర్య! 53

ఆ. పునుకఁ గుక్కతిత్తిఁ బోసినపాలు నీ
శ్ఛ్రధికనిందఁ బొరయునట్లు దుష్ట
మై యపాత్రవిషయ మగునీగి వృథవోవు
నిచ్చుచోటఁ బాత్రి మెఱుఁగవలయు. 54

క. తెగఁ దీర్పక తగనార్పక
తెగటార్పక కడమ కొంత ద్రికృఁగనున్నన్
జగతీశ! యప్పు నగ్నియుఁ
బగయును గడుఁ బెరుఁగుఁ గీడు వాటిల్లుఁ దుదిన్. 55

అర్థ. తెగన్ = తెగునట్లుగా; తగన్ = ఒప్పునట్లుగా; తెగటార్పక = చంపక; త్రిక్కన్ + కన్ = శేషముగా.

మ. విను ముద్యోగము రెంటియందుఁ బర; ము
ర్వీనాథ! యుద్యోగవం
తునకున్ దైవము దోడ్పడంగ ఫలసి
ద్ధుల్ సేకుఱున్ మానుషం
బున కొక్కెక్కెడ సిద్ధిదప్పిన వగల్
వొందంగరానీక య

ప్పని దైవోపహతంబుఁగాఁ గనుట భూ
పాలార్హవృత్తం బగుః. 56

అర్థ. రెంటియందుః=దైవపౌరుషములందు; మానుషంబు = మనుష్యప్రయత్నము.

కం. ధన మపహరించుటయు తన
కనిశముఁ బనిగాఁగ బ్రదుకు నఖిలుబ్ధునకుః
విను శత్రులచే నాటకు
మును దనప్రజచేన చేటు మూఁడు నరేంద్రా ! 57

క. సత్యమ ధర్మము తపమును
సత్యమ ప్రజలను సృజించు సత్యమ లోక
స్థిత్యాదానముఁ జేయును
సత్యం బనృతంబుచేత సంపిహిత మగుః. 58

అర్థ. లోకస్థితి + ఆదానము = జగత్తుయొక్క ప్రతిష్ఠాస్థాపనమును; సంపిహితము=మాయఁబడినది.

క. అనఘా ! దుఃఖాత్మక మగు
నన్నృతం బడఁగించుటకుఁ బ్రయత్నమున సుధీ
జను లాచరింతు రనిశం
బును మోహావిఘాతనియమములు నిష్ఠమెయిః. 59

అర్థ. దుఃఖాత్మకము = వ్యసనములతో నొప్పునది; సుధీజనులు = బుద్ధిశాలులైనవారు; అనిశంబును = ఎల్లప్పుడును; మోహావిఘాతనియమములు=భ్రాంతిని నడఁగించు ననుష్ఠానములు.

క. బలయు జరావ్యాధిప్రభృ
తులు శారీరములు, గాఢతోషకశోకా
దులు మానసములు దుఃఖం
బులు రెండువిధముల నిట్లు పురుషుల నలఁచున్. 60

అర్థ. బలయుజరావ్యాధిప్రభృతులు = క్రమముగాఁగలుగుచుండు ముసలితనము, రోగము మున్నగునవి; శారీరములు=దేహమునకుసంబంధించినవి; గాఢతోషకశోకాదులు=హెచ్చగుసుఖదుఃఖములు; మానసములు=మనస్సునకు సంబంధించినవి.

క. శారీరమానసము లగు
నీరెండు విధములు దన్ను నేపకయుండం
గోరికొని నియమములఁ బ్రతి
కారము లొనరింపఁగా సుఖం బొందు నరుణ్. 61

అర్థ. ఏపక=కష్టపెట్టక; ప్రతికారములు=మాఱు సేఁతలు.

క. గతహర్షభయక్రోధుఁడు
ధృతిమంతుఁడు నప్రమత్తధీమహితుఁడు సం
శ్రితధర్ముఁడు దాంతుఁడు నగు
నతఁ డవసాదంబు నొందఁ డతులవివేకా ! 62

అర్థ. గతహర్షభయక్రోధుఁడు=సంతోషము భీతి కోపము-ఇవిపోయినవాఁడు; ధృతిమంతుఁడు=ధైర్యముకలవాఁడు; అప్రమత్తధీమహితుఁడు=ప్రమాదపడనిబుద్ధిచే శ్రేష్ఠుఁడు; సంశ్రితధర్ముఁడు=ఆశ్రయింపఁబడిన ధర్మములు కలవాఁడు; దాంతుఁడు=ఇంద్రియముల నిగ్రహించినవాఁడు; అవసాదంబున్ = తుదను.

క. ధర్మ మధర్మముఁ బోలు న
ధర్మము దా ధర్మ మగువిధంబునఁ దోఁచుం
గర్మసమితి నొకొ్కకయెడ
ధర్మగతి యెఱుంగవలయుఁ దచ్ఛాస్త్రములన్. 63

అర్థ. కర్మసమితి = వేదోక్తములగుకర్మములసమూహము; తత్ + శాస్త్రములన్ = ఆ (ప్రసిద్ధమైన) శాస్త్రములచేత.

గీ. బంధనంబులలో నెల్లఁ బరమబంధ
నంబు గామంబు; తద్వర్జనమున నాత్మ
యభ్రపటలంబు వాసిన యమృతకిరణ
పూర్ణమండలమును బోలెఁ బొలుచు ననఘ! 64

అర్థ. అభ్రపటలంబు = మేఘములసమూహము; అమృతకిరణపూర్ణ మండలమును = నిండుచందురునియొక్క గోళమును.

క. శమనిరతియు నాత్మజ్ఞా
నముఁ జూవ్వె బుధులలక్షణంబులు పర్యా
ప్తము లివి రెండు గలుగ మో
క్షము సాధించుటకు వేఱ కల్పన లేలా? 65

అర్థ. శమనిరతియున్ = ఓర్పునందలి యాసక్తియును; ఆత్మజ్ఞానమున్ = జీవాత్మపరమాత్మలను గూర్చిన జ్ఞానమును; పర్యాప్తములు = చాలినవి.

మ. గురుశుశ్రూషయు నాగమాధ్యయనముల్ గోష్ఠీనిరాసంబు; ద
త్పరతన్ మేన్ దొడయుంగఁ దాఁ జొరమియున్ భైక్ష్యాశనత్వంబు మ

ద్వరకర్మంబులయందు రాగభరగా
ఢద్వేషముల్ లేక యె
వ్వరితోడం బగగాక యున్కియును భ
వ్యబ్రహ్మచర్యోక్తముల్. 66

మ. నిజదారైకపరత్వముం గరుణయుం
నిక్కంబునుం దాల్మియుం
సుజనాసంగము దేవపితృతిథిసం
శుద్ధార్చనల్ హవ్యభు
గ్భజనంబుం సకలాశ్రమస్థులను శ
క్యప్రక్రియంబ్రోపుఁ బం
కజగర్భుండు గృహస్థధర్మములుగాఁ
గల్పించె సర్వేశ్వరా! 67

శా. తానుం భార్యయు నేగుఁ బేరడవికిం
దా నొక్కఁడైనం జనుం
మానాహంకృతు లూడ్చి నింద్రియముల
న్మర్దించు నచ్చో జడల్
పూనుం, దాపసశాస్త్రముల్ సదువుఁ, జ
ల్పుం గోష్ఠి తద్జ్ఞాళితో,
వానప్రస్థవిధాప్రవిష్టుఁడు ప్రజా
వాత్సల్యనిష్ఠాత్మతన్. 68

శా. ఎచ్చోనైనను నిల్చు; నాఁకటికి నే
మేనింగొనున్ రాత్రియై
నచ్చో నెమ్మి శయించు నగ్నిపరిచ
ర్యాం బాసి వర్తించుఁ దా
నిచ్చం గోరఁ డొకండు నింద్రియజయం
బేపారు; భోగంబులన్
మెచ్చున్-మ్రొక్కను-నొల్లకుండు; యతి పే
ర్మిన్ నిర్మముండై నృపా! 69

కం. శరణాగతుండ భక్తుఁడఁ
బరమపదవిఁ గోరెదను, శుభంబుగ నన్నున్
బరికించి యేది మేల
య్యెరవు దొరకొనంగఁ దలఁపవే కమలాక్షా! 70

క. సర్వమునందును దానున్,
సర్వముఁ దనయందు నుండు;సంచారంబున్
సర్వమునకుఁ దనవలనన;
సర్వాత్మకు నట్టి వృష్ణిసత్త్వముఁ దలఁతున్. 71

కం. మంగళము విష్ణుదేవుఁడు
మంగళ మెమ్మెఁదలంప మధురిపుఁ డుద్య
న్మంగళ మంభోజాక్షుఁడు
మంగళ మఖిలము విహంగమధ్వజుఁ డరయన్. 72

సంపూర్ణము.